# దిద్దుబాటు చరిత్ర




అనువాదకుఁడు

**డి. జె. రత్నము,** ఎం. ఎ., బి. ఇడి.

హెడ్మాష్టరు అండ్ కరెస్పాండెంటు

యు. యల్. సి. యం. హైస్కూలు, గుంటూరు.

# ఉపోద్ఘాతము

పదునారవ శతాబ్దారంభమున, యూరపు ఖండమునందు జరిగిన సంఘ సంస్కరణ, ప్రపంచమంతయు వ్యాపించెను. అట్టి దిద్దుబాటునకు మార్టిన్ లూథరను మహనీయుడు కారకుఁడయ్యెను. పురాతన యలవాటులను మార్చి నూతన యలవాటులఁ బ్రవేశపెట్టుట యనునది సులభసాధ్యముగానిపని. లూథరు జీవితము వలన నన్నిదేశములలోఁగల యన్నిమతములవారు పాఠముల నేర్చుకొనవచ్చును. అన్యాయము నరికట్టి, సత్యమును నిలుపబెట్టుటకు సత్యాన్వేషణము నవలంభించు వ్యక్తులుబొందు శ్రమలను గుర్తించగలుగుచున్నాము. ఈ చరిత్రనాలుగువందల సంవత్సరములకుఁ బూర్వము జరిగినను, దానినుండి పాఠములెన్నియో నేర్చుకొనగలుగు చున్నాము.

ఈ చరిత్ర యారంభమున రెవ. జె. ఎ. డార్మ్ స్టేటర్ అను జర్మనీదేశస్థునిచే (జర్మనీభాషలో వ్రాయఁబడి, ఇంగ్లీషు భాషలోనికి అమెరికాదేశపు విద్వాంసుడగు రెవ జోసఫ్ స్టంపుగారిచే తర్జుమాచేయబడి, దానినుండి, యాంధ్రభాషలోనికి నాచే సిరంపూరు విశ్వవిద్యాలయమువారి యాజమాన్యమున మార్చబడెను. ఈగ్రంధమును ఏ సి. సి. కమిటీవారి యనుమతిచే క్రిస్టియన్ లిటరేచరు సొసైటీ వారచ్చొత్తించుటకు సమ్మతించిరి. కాని కాలవ్యాపనముగుననెడి భీతిచే స్వంతముగనే దీనిని బ్రకటించుచున్నాను. దీనిని ప్రకటించుటకు కావలసిన ప్రోద్బలము నొసంగిన రెవ. యస్. సుందరేశన్, రెవ. జె. డి. శౌరిగార్లకు నాయభివందనములు.

ఈ గ్రంధమునందుఁ గనబరచఁబడిన సంస్కరణ, ప్రతి మానవుని హృదయమునందును గలుగునటుల యీచరిత్ర తోడ్పడునుగాక !

గుంటూరు, }
9—5—56. }

డి. జె. రత్నము,
అనువాదకుడు.

# అస్మదీయం

మీ "దిద్దుబాటుచరిత్ర" చాల ఉత్తమోత్తమమైన గ్రంథము. కొంచము ఓపికతో తరచి చూచినచో మానవాభ్యుదయమునకు పలయు మహత్తర కీలకములెన్నియో నిందు గోచరించగలవు. జీవిత పరమావధినెరిగి ఏపాటి దైవచింతన - సంస్కారాభిలాష గలవారికైనను, ఈ గ్రంథము పూజనీయమైనదిగాను, ఆదర్శ ప్రాయమైనదిగాను తోచితీరుననుట కెట్టిసందేహములేదు. ముద్రణా సమయమునందే నాకీ గ్రంథమునందమిత ఆసక్తిజనియించినది. అందువలన మీ గ్రంథమును ఇంటికి గొనిపోయి పదేపదే చదువుట కభిలషించితిని. పిదప నా గ్రంథముపట్ల నాకు మరంత వ్యామోహమేర్పడెను. అనువాదముకూడ మంచి యమకముగను-మధురము, సరళముగను నడచినది. ఎంతయో ఆధ్యాత్మిక సుసంస్కార ముండిననేగాని, ఇట్టి గ్రంథమును అనువదించుటకుగాని, రచించుటకుగాని వలనుపడదని నాభావము. ప్రతి మనుజుని దిద్దుబాటునకును నిజమునకీ గ్రంథము అద్దమువంటిదనిన అతిశయోక్తి కానేరదు. నాకీవరకు ఒక్క జీసను ప్రభువునందున మాత్రమే పూజనీయభావ ముండెడిది. ఈ గ్రంథ పఠనానంతరము శ్రీ లూథరుమహాశయునియందు కూడ పునీతభావము పెనవేసుకొనినది.

భవదీయుడు,

వంగల అచ్యుతరామయ్య

భీమవరం.

# విషయసూచిక

## ఉపోద్ఘాతము.

### 1 దిద్దుబాటుకుముందు సంఘముయొక్క విచారకరమగుస్థితి



### 2 దేవుడు లూథరుని తయారుచేయుట



### 3 దిద్దుబాటుయొక్క ప్రారంభదశ

## 4 దిద్దుబాటుయొక్క వృద్ధి, వ్యాప్తి



## 5 దిద్దుబాటుయొక్క వ్యాప్తి



## 6 లూథరుయొక్క కుటుంబజీవితము, ఆశీర్వాదింపఁబడిన మరణము

# ప్రథమ భాగము



దిద్దుబాటుకు ముందు సంఘముయొక్క విచారకరమైన స్థితి.

## 1. ఆత్మీయ క్షీణదశ

పెంతికోస్తు పండుగ యిహమున క్రీస్తు సంఘముయొక్క పుట్టుకదినము. ఆ దినమున పరిశుద్ధాత్మ అపోస్తులను వెలిగించుటకును, సత్యమునందు నడిపించుటకును, వారిమీద కుమ్మరింపబడెను. మఱియు నాదినముననే మూడువేలమంది, విశ్వాసుల సమూహములోఁ జేర్చబడిరి. నూతనముగా స్థాపించఁబడిన సంఘములోఁ జేరిన సభ్యులు, అపోస్తలుల బోధయందును, సహవాసమందును, రొట్టెవిరుచుట యందును, ప్రార్థనలయందును నెడతెగక నిలకడగా నుండిరి. రక్షణ పొందుచున్నవారి నందఱిని ప్రభువు తనసంఘములో ననుదినము చేర్చుచుండెను.

యూదులెవరిని నిరాకరించిరో వారియందుఁ దప్ప మఱియెవరి వలనను రక్షణ కలుగదని ధైర్యముగా సాక్ష్యమిచ్చిరి. అందువలన యూదులకుఁ గోపమువచ్చెను. వారు సంఘమును హింసించి, అపోస్తలులను బట్టుకొని, చెఱసాలలలో వేసి కొట్టిరి. మొదటి హతసాక్షియైన స్తెఫనును జంపిరి. యెరూషలేములోనున్న సంఘము గొప్ప హింసకు లోనై

సందున, వారు ఫొనీషియా, కుప్రి, దమస్కసు, అంతియోకై పట్టణములకు పరారైరి. అయినను వారెక్కడికి వెళ్ళిరో యచ్చోటకు శుభవర్తమానమును దీసికొనివెళ్ళిరి. ఈరీతిని విరోధులుసహా, సంఘమును వృద్ధిచేయుటకుఁ దోడ్పడిరి.

అన్యజనాంగము నుండియు హింసలు వచ్చెను. ఇట్టి హింసలు మొదట యూదుల నుండి వచ్చిన హింసలకన్న మరియెక్కువ ఘోరముగా నుండెను. రోమా చక్రవర్తుల వలనఁబడి గొప్పహింసలు కలిగెను. నీరోచక్రవర్తి (క్రీ. శ. 64-68) కాలములో మొదటి గొప్పహింస కలిగెను. నీరో రోము పట్టణమును దగుల బెట్టించి క్రైస్తవులే చేసిరని వారిని నిందించెను. దానికి ఫలితముగా క్రైస్తవులను హీన పరచి చంపించెను. వారిని మృగముల చర్మములలోఁ బెట్టి కుట్టి, కుక్కలచే చీల్చబడు నట్లుచేసిరి. నీరోచక్రవర్తి తన పెరటిలోఁ గందకములను తీయించి సజీవులను పూడ్చిపెట్టి కాగడములవలె వారిని గాల్చి చంపెను. అతని తరువాత వచ్చిన చక్రవర్తుల కాలములోని విషయములెంత మాత్రమును బాగుండలేదు. లెక్కలేని క్రైస్తవులను ఖడ్గములతో జంపిరి. మఱికొందఱిని శిలువవేసిరి.

అట్టి భయంకరమైన హింసల వలన సంఘము నిర్మూలము చేయఁబడునని తలంచ వచ్చును. కాని యట్లు జరుగ

లేదు. సంఘమునకు క్రీస్తు యొక్క వాగ్దానము కలదు. అదేదనగా "నరకద్వారములు సహా సంఘమునకుఁ గీడు చేయలేవు". వందలకొలది క్రైస్తవులు చనిపోయినప్పటికి, వేలాది నూతన క్రైస్తవులు సంఘమునకు చేర్చబడిరి. మూఁడు వందల సంవత్సరముల వఱకు సంఘము జయోత్సవములో దురాత్మునియొక్క హింసల నెదిరించెను. పవిత్రమైన సువార్తకు, ననేకవిధములైన తప్పుడు బోధలను విషపు మొక్కల వలె విరోధి కల్పించుచునే యుండెను.

తుదకు దేవునిసంఘమునకు బయటనుండి తొందరలు జరుగలేదు. రోమాచక్రవర్తియగు ఘనుఁడైన కాన్స్టంటైను 323 లో బాహ్యముగా క్రైస్తవ విశ్వాసము నొప్పుకొనినప్పటినుండి మఱియే యితర హింసలు సంఘమునకు రాలేదు.

సౌలు క్రైస్తవుఁడయినప్పుడు క్రైస్తవసంఘము కొంత కాలము వఱకు నెమ్మదిగా నుండి క్షేమాభివృద్ధి నొందెను. (అ. కా. 9:31) అదేరీతి నిప్పుడు నట్టి సమాధానస్థితి కలుగవలెనని నిరీక్షించవచ్చును. కాని బయట తొందరలు సంఘమునకు లేకుండా చేయుట దేవుని మహా కనికరమును బట్టి జరుగుట తనకే హానికరముగా పరిణమెను. పేదరికము, ద్వేషము, హింసలనుఁడి సంఘము విడుదలనొంది శాశ్వత

మగు వాని యందు మనస్సుంచక, లోకభోగేచ్ఛల మీాదనే మనస్సంతయుం జలించెను. సంఘములోఁ జేరిన వారికి నవమానము, హింస, భయంకరమైన మరణములకు బదులు, గౌరవము, ధనము, భోగములు లభించెను. ఇట్టిస్థితి సంఘబోధకులకు, బిషప్పులయొక్క నాశనమునకు ఋజువయ్యెను. లోకము క్రీస్తు సంఘములోనికి జయోత్సవముతో ప్రవేశించినట్లు కనఁబడెను. లోకము యొక్క వృధాతిశయము సంఘమును బరిపాలింప సాగెను. అతి సూక్ష్మకాలములో, నిష్కల్మష సిద్ధాంత పవిత్ర జీవితముల కొఱకు, సంఘమాశపడెను.

ఆదిలో "అతినేసి"యను, ఆంబ్రోసు, అగస్టిన్ మొదలగు క్రీస్తుసేవకులను, గొప్పసాక్షులుగా నుండుటకు దేవుఁడు వారి నేర్పఱ్చుకొనిన విషయము సత్యమే. సంఘములోఁ జొరబడిన చెడుగును వారెంతో ధైర్యముగా నరికట్టిరి. ప్రకాశించుచున్న నక్షత్రములవంటి వీరు క్రీస్తు ద్వారా కలిగిన యపారమైన దేవుని కృపను మరుగు పఱచి, తప్పు త్రోవను బట్టించిరి. దీనికి ఫలితము II థెస్స. 2 అధ్యాయములోఁ జెప్పబడినట్లు పోపుల దుష్ప్రవర్తన వలన దుష్ప్రచారము సంఘములోఁ జొరఁబడెను.



## 2 రోమా బిషప్పుయొక్క నటనలు.

క్రైస్తవ సంఘ మారంభ మైనపుడు, రోమాపురి ప్రపంచమునకు ముఖ్యపట్టణమై యుండెను. అట్టికారణమున రోమా బిషప్పులకు మెప్పు, ఘనత కలిగెను. వారికి ముందున్న వారికి గలిగిన గౌరవము రోమా బిషప్పులకుఁ గూడ నుండవలెనని యాశించిరి. మోసము, అన్యాయము వలన వారి యధికారమును స్థాపించుటకుఁ బ్రయత్నించిరి. "పరిపేతురు పీఠము" అను కల్పనా గాధ నాధారము చేసికొని, తమటక్కరి తనమును స్థాపించిరి. భూమిమీద పేతురును క్రీస్తుయొక్క ప్రతినిధిగా "ప్రభు"వైన యేసు స్థాపించె నని బోధించిరి. అందువలన, పేతురుయొక్క స్థానము రోములో నుండెననియు, నాపట్టణముయొక్క మొదటి బిషప్పనియు బోధించిరి. బిషప్పు లందఱు పేతురు తరువాత వంశపారంపర్యముగా హక్కుగలవారనియు, క్రీస్తుయొక్క ప్రతినిధులనియు బోధించిరి. క్రీస్తు సంఘముయొక్క కనఁబడని శిరస్సనియు, పోపు లేక బిషప్పు కనబడు శిరస్సనియు బోధించిరి, చివరకిట్టి యసత్యపుటర్థ్మత నందఱు నమ్మిరి.

క్రీస్తుయొక్క ప్రతినిధులనబడిన వారెంత వఱకుఁ దమ యధికారము చలామణి చేయవలెనో యంతవఱకుఁ జలామణి చేసిరి. వారు చెప్పినదంతయు దేవుని నుండియే

వచ్చుచున్నదని బోధించిరి. పరిశుద్ధ గ్రంధమును వారే యర్ధము చెప్పుటకుఁ దగిన వారని తెల్పిరి. సంఘ సభలు చేసెడి తీర్మానము కూడ పోపుగారి యనుమతి పొందవలె నని బోధించిరి. రోమాలోనున్న పాదరు, మోక్షనరకముల మీదఁ గల్పించబడిన పర్గేటరి మీదను, వారికి సర్వాధి కారమున్నదని ప్రకటించి, వాటిద్వారా బంధములు తెరుచు టకును, మూయుటకు నధికారముగలదని ప్రబోధించిరి.

క్రీస్తుచెప్పిన దేమనఁగా "అన్యజనములలో రాజులు వారి మీదఁ బ్రభుత్వము చేయుదురు; వారిమీద నధికా రము చేయుఁ వారుపకారులనబడుదురు. మీరు మాత్రమాలా గుండరాదు" (లూకా 22:25) క్రీస్తుయొక్క మాటలు పేతు రుకు మాత్రమే కాక యితర శిష్యులకును సరిపోవును. కాని వారు పేతురుయొక్క యుత్తరాధికారులని పిలువఁబడుటకు నర్హులు కారు. ఎందుకనఁగా కాలక్రమేణ వారి యధికారము భూలోకమునుండి యాకాశమువరకు వ్యాపించెను. వారి యిష్టానుసారముగా, చక్రవర్తులను రాజులను నియమించిరి. కని వినని దౌర్జన్యముచే వారిని పదవీభ్రష్టులను జేసిరి. ఎవ రైనఁ బోపుగారి యధికారమును దిక్కరించిన యెడల నత నిని సంఘమునుండి బహిష్కరించిరి. అనఁగా సంఘము యొక్క హక్కులనుండి, యాధిక్యములనుండి తొలగింపఁ జేసిరి. పోపుగారి యధికారము క్రిందకు రానటువంటియు,

వారేర్పాటుచేసిన చట్టముల క్రిందకు రావట్టి దేశములన్నిటి ననేక విధముల శిక్షించిరి.

పోపుగారి పేరును సంపాదించు కొనుటయనగా గొప్ప యవమానమును భరించుటయే. 1077 లో నాల్గవ హెన్రీ కాలములో "ఆల్ప్సు"పర్వతముల మీదుగా కుటుంబముతోను కొందఱు నమ్మకమైన సేవకులతోను, పోపుగారి ప్రాపకము కొఱకును, వెలివుంచి విడుదల నొందుటకును, కష్టతరమగు ప్రయాణము చేసి, శిరోవేష్టనముగాని, పాదరక్షలుగాని లేకయే పశ్చాత్తాపమును జూపించు వస్త్రములు ధరించుకొని మూడు దినములవరకు "కనోసా" అను పట్టణములో నేడవ గ్రెగోరి పోపుగారి ముందు దపస్సు చేసెను. 1177 లో చక్రవర్తియైన ఫ్రెడెరిక్ బార్బరోసా "అలెగ్జాండర" రను పోపుగారి బహిష్కారాజ్ఞనుండి తప్పించుకొనుటకు "పోపుగారి" ముందు సాష్టాంగనమస్కారించి పాదములను ముద్దుపెట్టుకొని, కనికరము కొఱకు వేడుకొనెను, తదనంతరము పోపుగారు చక్రవర్తి మెడ మీద దనకాలునుంచి "నీవు సింహములను. నాగుపాములను ద్రొక్కెదవు, కొదమ సింహములను, భుజంగములను సణగద్రొక్కెదవు" (కీర్త 91:13) అని పలికెను.



## 3 పోపుల బహిరంగ పాపజీవితము.

పోపుల యధికారము దుష్కృత్యములోఁ బడినప్పటికి నింకను నధికారమును జలాయుణీచేయదలచుట గ్రహించలేని విషయము. పోపుల యధికారము పూర్తిగా వృద్ధికాక మునుపే, పోపులయధికారమందున్న ప్రజలలో పాపమునకు, యవమానమునకు స్థానమాయెను.

తొమ్మిదవ శతాబ్దము చివర, రోమాపట్టణములో టస్కానివాఁడైన అడల్బర్టుమార్క్వి అనునతని పేరట "స్కాని యన్లు" అనునొక ముఠా బయలుదేరెను. ఆముఠాకు "థియొడోరా" యను రోమాపట్టణస్త్రీలు ముఖ్యురాలైయుండెను. ఆమె జీవితము సరిగాలేదు. ఆమెకు "మరోజయా" "థియొడోరా" యను బిడ్డలు కుమార్తెలుండిరి. వారిజీవితము తమ తల్లికన్న నేమాత్రమును మంచిజీవితముకాదు. దాదాపొక యర్ధశతాబ్దము వఱకు (904-963) పోపులు వీరిస్వాధీనములోనుండి వారేది చేయదలచిన నది చేయగలిగిరి. ఆకాలములోఁ బన్నెండుమంది పోపులు కామాతురత, దొంగతనము నరహత్య, దేవదూషణ మొదలగు దుర్గుణములతో నిండుకొని యుండిరి. మరోజియా నుంచుకొనిన "సెర్గియస్" అనువాఁడీ ఈపన్నెండు మందిలో మొదటివాడును, మరోజియాకుఁబుట్టిన పన్నెండవజాన్ చివరివాఁడునైయుండెను. ఈచివరి

వాఁడన్ని విధములగు పాపములలో బడిపోవుట మాత్రమేగాక దయ్యముల సహాయముకోరి, అన్యదేవతలను బూజించి తాను జూదమాడునపుడు గెలుపుకొఱకు వానిని బ్రార్థించి యిళ్లు పోపులయధికారము నంధకారత్వములో ముంచివేసెను.

అప్పుడప్పుడున్నత భావము కనఁపడినప్పటికి ద్రాష్ట్యము చివరకు జయమొందెను. దిద్దుబాటుకు ముందు లేక దిద్దుబాటు సమయంలో క్రైస్తవసంఘ ముఖ్యనాయకులు, సంఘము, నధోగతిలో నుంచిరి. నాల్గవ సిక్షుటన్ (1471–1484) తన క్రిందనున్న మతగురువులకు నోటవచింపరాని పాపములు చేయుటకు సెలవొసంగెను. ఆరవ యలెగ్జాండరు (1492–1503) వ్యభిచారమను సిగ్గులేని పాపమును జేయుచుండెను. వ్యభిచారియైన తనకుమారుని మతగురువుగా ఏర్పాటు చేసెను. మఱియొక మతగురువును విషముతోఁ జంపవలెనని ఏర్పాటుచేసి, తానే యావిషము పొరబాటునఁ ద్రాగి చనిపోయెను. రెండవ జూలియసు (1503–1513) ను గూర్చి, చక్రవర్తియగు మాక్సిమిలియను రోమాలోనున్న త్రాగుబోతగు, జూలియసుకన్న సంఘమును గూర్చి, యేసుక్రీస్తు జాగ్రత తీసికొనని యెడల, నదిత్వరలో నాశనమగునని నుడివెను. పదియవ, లియో (1513–1521) యేసుక్రీస్తుయొక్క సువార్తను బుకిర టగాధగా నెంచి, యధికసౌఖ్యమనుభవించి,

నిత్యజీవమందుగల విశ్వాసమును గూర్చి హేళనచేయుటకు వెనుకాడలేము.

అట్టిన స్థితి పోపులలోనే కనఁబడగా, మిగిలిన మత గురువులు, మతసన్యాసులను గూర్చియిక నేమని తలంచ వచ్చును? మతగురువులకొక విధమైన పవిత్రతనుంచవలెనని ప్రయత్నించిరి. కాని వారిలోఁగల దౌర్బల్యమువలన నదివాడా యెను. గురువులు ప్రవర్తనను గాపాడుటకై వారాడంబర ముగా జీవించవలసి వచ్చెను. దైవనిర్ణయమైన వివాహము పవిత్రులకుఁ దగదని వారు పెండ్లాడకయుండిరి పరిశుద్ధ సమ భాక్త్వమునందు వారు మాత్రమే గిన్నెలోనిది త్రాగిరి.

ప్రభురాత్రి భోజనసంస్కారములోని ద్రాక్షరసము, రొట్టెలు, నిజమైన క్రీస్తురక్తము, శరీరమని బోధించే సిద్ధాం తమును, మతగురువులు ద్రాక్షారసమును, రొట్టెను, ప్రభు క్రీస్తురక్తము శరీరముగ మార్చగలశక్తి వారికి గలదనియు, బ్రతికియున్నవారికిఁ జనిపోయినవారికిఁ గీస్తునుబలిగా నర్పిం చుచున్నామనియు నందువల్ల నితరక్రైస్తవులకన్న దేవునికి వారు సమీపముగా నున్నామనియు బోధించిరి. పైవేషమంత యు వారిపేరాశను, డాంబికమును, దైవసంబాధమైన యజ్ఞా నమును గప్పిపుచ్చలేకపోయెను. మరియు వారి జీవితము సాటుతగా మారెను. అట్టివారి జీవితమును ప్రజల కెంతవరకుఁ బ్రోత్సాహకరముగా నుండెనో యూహించుకొనవచ్చును.

## 4 పోపుల తప్పుడు సిద్ధాంతములు

దైవసత్యమును గప్పిపుచ్చుటలోనే ముఖ్యమైన కీడు సంభవించెను. నీతిమంతుఁడు విశ్వాసమువలననే జీవించు ననెడి సత్యమును ప్రజలనుండి కప్పిపుచ్చుటనునదియే ముఖ్యమైనది. జీవితమునకు నోదార్పు నిచ్చునట్టి యీగొప్పసత్యమును క్రైస్తవ సంఘమునుండి కప్పిపుచ్చెను. క్రీస్తులోకపాపమును మోసికొనిపోవు దేవుని గొఱ్ఱెపిల్లయని బోధించినది సత్యమేగాని యొకవైపుబోధించిన దానిని రెండవవైపు దానికి మరుగు కలిగెను. పశ్చాత్తాపపడినపాపి, యేసుక్రీస్తుయొక్క పుణ్యమును బట్టి విశ్వాసముద్వారా శాంతిని బొందగలననే గట్టినమ్మకము లేక, మానవ యత్నములలోఁ బడవలసివచ్చెను.

ఈ రీతిగాఁ పశ్చాత్తాపపడిన వ్యక్తి బోధింపబడెను. క్రీస్తు నీకొఱకు చనిపోయెను. పరిశుద్ధబాప్తిస్మముద్వారాజన్మపాపమున్ను బాప్తిస్మముపొందు వఱకుఁ జేసిన పాపములున్ను క్షమించబడినవని బోధించిరి, కాని బాప్తిస్మము తరువాత పాపముచేసితివి. ఈ పాపముల విషయమై బాప్తిస్మమేమియుఁజేయలేదు. వీటినిమిత్తము ప్రాయశ్చిత్త సంస్కారణచేసిననేగాని పాపముపోదని బోధించిరి. కావున పాపి తన పాపమునుండి విముక్తిపొందగోరి మతగురువు నొద్దకువెళ్ళి తాను చేసిన పాపమంతయు నొప్పుకొన వలెనని బోధించిరి. కాని

చేసినపాపమంతయు నొప్పుకొనుట యసాధ్యము. కాబట్టి యొప్పుకొనుట యనునది మనస్సాక్షిని బాధించెను. గురువు పాపక్షమను ప్రకటించినను పాపికి మనశ్శాంతి రాదయ్యెను. ఎందుకనగా సరియైనటువంటియు పవిత్రమైనటువంటియు నొప్పుదలచేసి యున్నాడని యెట్లు తెలిసికొనగలడు!

మఱియు, నిత్యనాశనమునుండి క్రీస్తుమానవులను దన శిలువ మరణముద్వారా రక్షించెనుగాని, యిహమునఁ జేసిన పాపములకు వచ్చుశిక్షనుండి విముదలచేయలేదని బోధించిరి. అందువలన నిట్టిశిక్షను దప్పించుకొనుటకై గురువు కొన్నిపద్ధతుల, నుదాహరణముగా నుపవాసము ప్రార్థనలను వల్లించుట యాత్రలు మొదలగువానిని గల్పించెను. వీనిని సరియైన రీతిగా జరిగించినారని యెవరు చెప్పగలరు? ఈచిక్కులన్నిటిని దీర్పఁగలస్థలమొకటి యనఁగాదోషమును బోఁగొట్టుస్థలమొకటి (Purgatory) యున్నదని బోధించిరి. ఇహమునసరియైనరీతిగాఁదపస్సుచేయని యెడల నీదోషములన్నియు పర్గేటరిలో సరిచేయఁబడిన యెడల మోక్షమునకుఁ జేరవచ్చునని బోధించిరి. పర్గేటరిలోఁ బొందుహింసలు చాలఘోరమయినవనియు నవికొన్నివేల సంవత్సరములవఱకుండ వచ్చుననియు బోధించిరి. వీనినుండి నివారణపొందగోరువారికి మతగురువు సహాయము చేయగలడని బోధించిరి, ఎందుకనఁగా లోకపాప నివారణకొఱకు క్రీస్తుమాత్రమేగాక, పరిశుద్ధు

లును ప్రాయశ్చిత్త బలుల నర్పించిరని బోధించిరి. ఈ రీతిగా మానవ క్రియలకు ప్రాముఖ్యత వచ్చెను. ఎక్కువ మంచిక్రియలు కావలసిన వారికిఁ గొంతద్రవ్య మిచ్చిన యెడల లేక పాప క్షమాపణ పత్రికలు పొందినయెడలఁ దన కొఱకుఁగాని, చనిపోయిన తమబంధువుల కొఱకుఁగాని పాప క్షమపత్రికలను సంపాదించిన యెడల పర్గేటరీలో శిక్షపోవు నని బోధించిరి. ఈపత్రికలు ధనమున కమ్మఁబడెను. పోపుల తప్పుడుబోధలవలన "ప్రయాసపడి భారమును మోసికొను చున్న సమస్తమైనవారలారా నాయొద్దకురండి. నేనుమీకు విశ్రాంతిని గలుగఁజేతును" (మత్త 11:28) అని క్రీస్తుచెప్పిన వాక్యములను మరుగుపఱచి పాపిని క్రీస్తునుండి వేరుపఱచిరి.

పాపియొక్క రక్షణ తనస్వకార్యముల మీద నాధార పడక క్రీస్తునుబట్టియు నాయనపుణ్యమును బట్టియుమాత్రమే యుండునని యేమాత్రమును బోధించలేదు. ఎవరైననిట్టివిశ్వా సమును వెల్లడిచేసినయెడల నట్టివారిని చెరసాలలోనుంచి కొయ్యకు వ్రేలాడఁగట్టి యగ్నిలోఁబడ ద్రోసి, ఖడ్గము చేనరికి నిర్మూలముచేసిరి. విశ్వాసమనగా సంఘము చెప్పినదెల్ల చేయుటయే. అట్టివిశ్వాసమువలనఁబలపరచుటగాని, రక్షింపఁ బడుటగాని జరుగలేదు. సరియైనవిశ్వాసమునకు మానవులను దిద్దుటకు బదులు, సత్కార్యములు చేయవలయునని సంఘ ము బోధించెను. దేవుని కృపవలన సత్కార్యములు చేయఁ

బడెను. కాబట్టి దేవుని యెదుట నట్టివానికి మెప్పుగలదని బోధించిరి. మఱియు నానోటితోనే మనసత్కార్యములవలన దేవుని కృపను సంపాదించుకొనవలెననియు బోధించిరి. అట్టి ఘోరమైన యసత్యములతోను విరుద్ధచర్యలతోను బాబెలు వంటిగలిబిలి బయలుదేరెను. అందువలన టక్కరి తనము, స్వనీతి, నిరుత్సాహము మాత్రమే మిగిలియుండెను.

సత్కార్యములనఁగా నేమని భావించిరి? దేవునియాజ్ఞల ప్రకారము నడుచుకొనుట, తనకు నియమించఁబడిన పనిలో నమ్మకముగా నుండుట ఇవన్నియు స్వల్పవిషయములుగా భావింపబడెను. కాని గొప్పగొప్ప మఠములను గట్టించుటకు ధనమిచ్చుట, పిండి, మాంసము, పందిమాంసము గుడ్లు, ద్రాక్షారసము మొదలగునవి గురువులకు, సన్న్యాసులకుఁ దెచ్చియిచ్చుట, జపములతోఁ బ్రార్థించుట, యుపవాసముండుట, యాత్రలు సలుపుట, మఱియు ముఖ్యముగా మఠములో బ్రవేశించి, పేదరికమును, బ్రహ్మచారిత్వమును నవలంబించుట, సన్న్యాసులు వేసికొను వస్త్రములు ధరించుట సత్కార్యములని భావించబడెను. ఎవరిట్టివి చేసిరో వారికి జీవితానంతరము "పరిశుద్ధుడను" బిరుదును నిచ్చెడివారు. మఱియుఁ బరలోకములోఁ దనప్రార్థన సహాయము కొరకు నేడుకొనెడివారు.

క్రీస్తునుండి యాత్మలనింకను దూరముగా నుండునట్లు చేసిరి. ఎందుకనఁగా క్రీస్తు ఒక్కడే రక్షకుఁడని బోధించుటకు బదులుగా నాయన క్రోధముగల న్యాయాధిపతి యనియు, నాయనకోపముచు జల్లార్చుటకు నాయనతల్లియు, నితర పరిశుద్ధులును మధ్యవర్తులుగానుండి ప్రార్థించ వలసిన యవసరమున్నదని బోధించిరి. అన్నియవసరములలో మన పరలోకపు తండ్రితన ప్రియ సుతునిద్వారా ప్రార్థించవలయునని కోరుచుండఁగా బరిశుద్ధుల ద్వారా ప్రార్థించవలెనని బోధించిరి. పరిశుద్ధులు మానవుల సహాయకులుగా నుంచిరి. వారుచనిపోగా మిగిలిన వానికనగా నెముకలు, బట్టలు, వెంట్రుకలు మొదలగువానికి నద్భుతశక్తులు గలవనిబోధించిరి. తప్పుడు సిద్ధాంతములను గొప్పచేయుటకు, అపోక్రిఫాల్ పుస్తకములను సంఘపితామహులు, ఆది సంఘములు చేసినకట్టడలు మొదలగువానిని దైవగ్రంథముతో సమానముగఁ జూడసాగిరి. వీటన్నిటికిఁబైన పోపుగారొక్కరు మాత్రమే దైవగ్రంథమును సరిగా వ్యాఖ్యానము చేయగలవారు. ఇట్టిపోపుల తప్పుడు బోధల మోసములనుండి క్రీస్తుయొక్క సంఘము భూమిమీదనుండి శాసనము కాకుండుట దేవుని యపారమైన కృపకాదా!

---

## 5 యేసుక్రీస్తు తన సంఘమును గాపాడుట.

పాతాళముయొక్క ద్వారబంధములు దేవుని సంఘమునకు విరోధముగా తిరిగెను కాని జయమొందలేదు. ఎందుకనగా క్రీస్తు, సంఘమునకు మూలరాయియై బునాదియై యుండి దేవునికుడిపార్శ్వమున గూర్చుండి యుండెను. అనేక విషయములలో దేవునిసంఘము "ఆహాబు కాలములో" ఇశ్రాయేలీయుల రాజ్యమున్నట్లుండినను, వారిలో బేలు దేవతను ఆరాధించనివారున్నట్లు దేవుడు తన సంఘములో కొందఱిని నుంచెను. పరిశుద్ధస్థలములో దిక్కుమాలిన స్థితియుండెను, గాని యది సంపూర్ణముగా పాడైపోలేదు. దేవుని వాక్యము సంపూర్ణముగా నశించలేదు. మఱియు నిసజీవమైన వాక్యము మంచి ఫలితమును ఫలించెను.

పరిశుద్ధబాప్తిస్మ సిద్ధాంతము పలురకముల మానవ కల్పితములతో నింపబడినది. అయినప్పటికి దానిద్వారా నూతన జీవములోనికి నాత్మలు పుట్టుచునేయుండును. ప్రభురాత్రిభోజన సంస్కారము భిన్నాభిన్నముచేయబడి సరిగా వాడబడనప్పటికి విశ్వాసుల యాకలితో నున్న యాత్మలు తృప్తిచెందుచునే యుండెను. నగరులలోను, గుడిసెలలోను, మఠములలోను, అరణ్యావాసములలోను, వాక్యము పరిశుద్ధ సంస్కారము ద్వారా కొందఱి యాత్మలతో దేవునియాత్మ

పనిచేయుచునే యుండెను. అట్టివారు క్రీస్తుమీదనే తమ రక్షణ యాధారపడి యున్నదని గ్రహించి దేవునినాత్మ తోను, సత్యముతోను నారాధించిరి. అనేకసజ్జనులు, సాతాను యొక్క యగాధములను గుర్తెరుగలేదు. వారుబాహ్యముగా, పోపుగారి కల్పనాచారములతో బంధింపబడి యుండియు క్రీస్తును దమ మంచి గొర్రెల కాపరిగా నంగీకరించి యుండిరి. మఱియు నిశ్చయముగా, నడవులలో సహితము కలత చెందిన యాత్మలను లోకపాపములను దీసివేయు దేవుని గొర్రెపిల్లయొద్దకు నడిపించి బోధించిరి. పోపుల దుష్పరిపాలనలో నేర్పాటైనవారి నెట్లు ప్రభుయేసుక్రీస్తు విశ్వాసమందుంగాపాడెనో నిత్యత్వము మాత్రమేమనకు బయలు పరచగలదు. ఆయనచిత్తము నిక్కాలమున సహితము చూడగలుగుచున్నాము.

అపోస్తలుల కాలములో నున్నట్టియు, మరలదిద్దుబాటు కాలమునం జూపబడిన నిర్మలమైన రక్షణమార్గము పోపుల యధికారమునకుఁ చిక్కుకొనబడిన వారివలన నెట్లు తెలియజేయబడెనో యూహించనలవి కాదు. ఇక్కారణము చేతనే, వారివిశ్వాసము, దైవాత్మ, ధైర్యముతో వెల్లడించిన విశ్వాసప్రమాణములు మఱియు మెచ్చుకొనదగినవి. పాపుల దుర్నీతిని ధిక్కరించిన బలమైన సాక్షులలో నీక్రిందనుదహరింపఁబడిన వారిని కూర్చికొంతవఱకు నాలోచించెదము.

## జాన్ హస్

అతఁడు 1373 లో బొహీమియాలోని, హుసినెక్ లో బుట్టి 1398 లో ప్రేగ్ విశ్వవిద్యాలయములో నధ్యాపకుఁడుగా నుండి 1402 లో నాపట్టణముయొక్క బెత్లెహేముగుడికి పాదిరిగా నుండెను. ఇంతకుముందు విరిగి నలిగిన హృదయుఁడై, క్రీస్తునందుగల విశ్వాసము ద్వారా దేవుని సమాధానమును బొందెను, దేవుని యెదుట నేది నీతియో, దానివిషయమై ధైర్యముగల బోధకుడయ్యెను. సంఘము నేలుచుండిన దుష్టత్వమును బహుధైర్యముగ ఖండించెను. 1415 జూలై 6 వ తేదీన కాన్స్టన్సు పట్టణపు టాలోచన సభవారి వలన బాతబడిన కొయ్యకుఁ గట్టబఁడి కాల్చి వేయఁబడుటకు నిర్ణయింపబడి యట్లుగావింపబడెను. రైను నదిలో నతని భస్మమును గలిపిరి.

## ప్రేగ్ నివాసియగు జరోమి

అతఁడు కూడ మరుసటి సంవత్సరము కాన్స్టన్సు పట్టణపు టాలోచన సభవలన బాతినకొయ్యకు గట్టబఁడి కాల్చి వేయబడెను.

## జాన్ వెస్సెల్

అతఁడు వరుసగా కొలోను, కావెయిన్, హీడెల్బర్గు, పారిసుల విశ్వవిద్యాలయములలో నధ్యాపకుఁడుగా నుండెను. అతఁడతని విద్యార్థుల వలన "లక్సుముండి" అనగా ప్రపంచ

జ్యోతి యని పిలువబడెను. అతనిగూర్చి లూథరు చెప్పిన దేమనఁగా వెస్సెలు నిదివరకే నేను జదివియుండిన యెడల, నా వ్యతిరేకులు నాభావములన్నియు వెస్సెలు నుండియే గ్రహించెనని యని యుండెడువారు. అనఁగా మాయిద్దఱి భావములు భేదములు లేకుండ నుండెను" అని నుడివెను. పలుకుబడిగల స్నేహితులు వెస్సెలును సంఘముయొక్క హింసనుండి కాపాడిరి. అతని మరణము తరువాత నతని వ్రాతలు భిన్నాభిప్రాయము గలవని కాల్చివేసిరి. 1489 లో నతడు చనిపోయెను.

## జరోమి సావనరోలా

ఇతఁడు 1498 నుండి ఫ్లారెన్సు పట్టణములో మారు మనస్సును గూర్చి శక్తిగల బోధకుఁడాయెను. ఆరవ అలెగ్జాండరతనిని కార్డినలుగాఁ జేయనుద్దేశించి నప్పుడతఁడు దాని నంగీకరించలేదు దానికి ఫలితముగా నతఁడు కాల్చఁబడి మరణము పొందవలెనని పోపుగారినుండి యధికారపు పత్రిము వచ్చెను. అతఁడట్లే మరణించెను.

ఈ సాక్ష్య సమూహము సరియైన దిద్దుబాటు కొఱకు నిరీక్షించి కొలది కాలములో నట్టిదిద్దుబాటు వచ్చునని యాశించిరి. చివరగాఁ జెప్పఁబడిన యిద్దరు వ్యక్తులు దేవుడు తన సంఘమును లేవనెత్తుటకై యేర్పాటు చేసికొనిన సేవకుని కాలమువఱకు జీవించియుండిరి.

# ద్వితీయ భాగము

## దేవుఁడు శూరుని తయారుచేయుట

### 1 లూథరుయొక్క పూర్వులు, అతని యారంభ విద్యాభ్యాసము

దేవుఁడు గొప్ప కార్యముల నల్పమైనవానితో సాధించును. తన జనితైక పుత్రుఁడు సహితము బెత్లెహేములోని పశులపాకలో లోకమును విమోచించుటకై మిగులనణకువతో జన్మించవలసి వచ్చెను. పూర్వకాలములో రాక్షసుఁడైన గొల్యాతు నెదుట నిశ్రాయేలీయుల దండంతయు గడ గడ లాడి నప్పుడు దేవుఁడొక గొప్పశూరుని పంపలేదు గాని యొక గొల్లపిల్లవానిని మాత్రమే యేర్పాటు చేసికొనెను.

రోమా రాక్షసి నరికట్టుటకు రాజనగరుల వైపు చూడనవసరము లేదు కాని పెద్దపరిస్థితుల నుండియే దేవుడతని నేర్పాటు చేసికొనెను. తన పూర్వీకులను గూర్చి లూథరిట్లు వ్రాయుచున్నాడు. "నేనొక వ్యవసాయకుని కుమారుఁడను; నాతండ్రి, తాత ముత్తాతలు అసలైన వ్యవసాయకులని" వ్రాసెను. లూథరుయొక్క స్వస్థానము తురింగియాలోని మోహరా అను గ్రామము.

గౌరవనీయమైన వ్యవసాయ కుటుంబమునకుఁ జెందిన హాన్సు లూథరు తగిన వంశీయుఁడై యుండి నాగలిని వదలి గనిని త్రవ్వెడి పనిలోఁ బ్రవేశించెను. తన దినాహారమును సంపాదించుకొనుటకై తనభార్యయైన మార్గరేటను నామెతో మోహారానుండి మాన్సుఫీల్డు జమీనులోఁ పనిచేయుటకై వెళ్లి మొదట "ఎయిస్లీ బెన్" అను గ్రామమును చేరిరి. కొంత కాలమునకు 1483, నవంబరు. 10 వ తారీఖున నొక కుమారుఁడు పుట్టెను. మరుసటి దినమాబిడ్డను సైంటు పీటర్సు చర్చికిఁ దీసికొని వెళ్లి బాప్తిస్మమిప్పించిరి. ఆదినము సైంటు మార్టిను దినము కాఁబట్టి యా బిడ్డకు మార్టిను అని నామమిడిరి.

దేవుడుఁ తన కార్యములన్నిటిలో నాశ్చర్య కరుఁడు. ప్రతివ్యక్తియొక్క జీవితములోఁగూడ నాశ్చర్యకరముగానే యుండును. ఆచిన్నమార్టిను యొక్క యారంభదశనుండి దైవముయొక్క యద్భుత శక్తికనబడుచునేయుండెను. గరుకు రోడ్లమీద నడచుటకును, బరువుమూటల మోయుట కేర్పాటయిన వాఁడు తనయారంభదశలో భరింపరాని కష్టములనను భవించెను. అట్టికష్ట స్థితులనుండి కరుణాసముద్రుఁడైన తండ్రి మార్టిను బాలకుని గృపతోఁ గాపాడెను. తన బాల్యదశ తల్లిదండ్రులయొక్క పేదరికముతోఁ గూడుకొనియుండెను. లూథరు చెప్పినదేమనఁగా "మొదట మా తల్లిదండ్రులు

చాల పేదవారు. మా తండ్రి కట్టెలు - కొట్టువాఁడు. మా తల్లి కట్టెలు మోసి, వాని నమ్మి మమ్ములను పెంచెనుఁ వారెంతో కష్టములనుభవించిరి. అట్టి పనులీ దినములలో బ్రిజలు చేయరు."

అట్టి పరిస్థితులలో మార్టిను బాలునకు సుకుమారత్వమరుదు. తల్లిదండ్రుల దైవభీతియు దోలిచూలి కుమారుని యెడఁగల ప్రేమ తమ కుమారుని బాల్యమునకు చేటాయెను. కాని దేవునియొక్క యపారమైన కృపచేత నదియు మంచిగా మారెను. ఎట్లనఁగా హాన్సు, మార్గరెటులు తమ కుమారుని క్రైస్తవ మార్గములోఁ బెంచ నిశ్చయించిరి. అట్లుచేయుట బెత్తము నుపయోగించకుండఁ జేయుట యసాధ్యము. ప్రతి చిన్నతప్పును బహుకఠినముగా శిక్షించిరి. లూథరు తరువాత నిట్లనెను. "ఒకసారి మాతండ్రి నన్ను నేనింటి దగ్గరనుండి పారిపోయేవఱకు గొట్టెను చిన్న మరమేకును గూర్చి నన్ను మాతల్లి రక్తము కారువఱకుఁ గొట్టెను"

ఐదు సంవత్సరములుపూర్తి కాకమునుపే తల్లిదండ్రులు లూథరును బడికి పంపిరి. చలిగాలిలోఁ దండ్రిగాని లేక యొక పెద్ద పిల్లవాఁడుగాని లూథరును బడికి మోసికొని వెళ్లెడివాఁడు. ఇంటిదగ్గరనున్న కఠినమైన శిక్షకు బడిలోని

కఠినమైన శిక్షకూడా తోడాయెను. ఒకనాటి యుదయము నాన నుపాధ్యాయుడు లూథరును పదిహేనుసార్లు బెత్తముతోc గొట్టెను. అయినప్పటికి లూథరు చురుకుగా నే నేర్చికొనెను. పదునాల్గవసంవత్సరమున మాగ్డిబర్గులోని హైస్కూలునకుc బంపcబడెను. కాని యక్కడ పేదరిక మననేమియో తెలియవచ్చెను. తండ్రిసహాయము తక్కువయ్యెను. అందువలన నితర పేదపిల్లలతోc గలసి యింటింటికి వెళ్లి భిక్షాటనc జేయవలసి వచ్చెను.

ఇట్లు పాటుబడి భోజనము సంపాదించుటవలన, దవిలంబైన కాలము పాడైపోయెను. ఎన్నిసార్లు, తిండికి బదులు తిట్లుతcబు తినియుండలేదు? కఠినోక్తుల తరువరి, కరుణగల కార్యములు కూడా నప్పుడప్పుడు కనcబడినవి. ఒకనాడీవిధముగా జరిగెను. అదికిస్మసు కాలము. క్రీస్తుబాలుని గూర్చి పాడుచు, లూథరు తనస్నేహితులొక వ్యవసాయకుని యింటి ముందునిలబడిరి. యింటియజమాని పిల్లలారా ఎక్కడున్నారు? అనిగట్టిగా కేకవేసెను. అది విని బాలురందరు భయపడి పారిపోయిరి. పారిపోవుట చూచి వ్యవసాయకుcడు కూడ వారివెంట, బరుగెత్తెను. వారి నతcడు కలసికొనగా నతని చేతిలో వారికొఱకు మాంసపు కూరయున్నట్లు వారు గ్రహించిరి. మాన్సుఫెల్డులో గఠిన శిక్ష మేలుగాc బరిగణించినట్లు లూథరుకుc గలిగిన యనుభవము లన్నియు మేలుగా సమ

కూడెను. ఎందుకనఁగా "యౌవనకాలమున గాడిమోయుట నరునికిమేలు" (విలాప 3:27) అని వ్రాయబడియున్నది. ఒక ప్రత్యేకమైన పనికి దేవుఁడేర్పాటు చేసికొనిన వానిని గూర్చి యిట్టిది సత్యమే.

కాని తనశక్తికి మించి శోధింపఁ బడలేదు. తనకు విపరీతమైన కష్టములు వచ్చినపుడు, తనహృదయము క్రుంగి పోవుచుండఁగా మాతృస్వభావము చూపించఁ గలిగిన యొక యమ్మను దేవుఁడతనికిఁ జూపించెను. ఉర్స్యులకాటాయను నామె చాలా భక్తిపరురాలు. గౌరవనీయురాలై యుండెను. లూథరుయొక్క పాటలను బట్టియు, నతని ప్రార్థనా శక్తిని బట్టియు నామె తన యింటిలో నుండుటకును, భోజనపు బల్ల యొద్దఁ గూర్చుండుటకును జేర్చుకొనెను. ఇప్పుడు తన దారిద్ర్యమంతయు నంతరించెను. తన పాఠములను శ్రద్ధతోఁ జదువుకొనఁగలిగెను. అందువలన నప్పటినుండి తనతోటి విద్యార్థుల నందఱిని మించెను. రొట్టెకొఱకు, పాడనవసరము లేనప్పటికి, ప్రభువును గూర్చి యనేకమైన పాటలను బాడెను.

## 2 ఎర్ఫర్టు విశ్వవిద్యాలయములో లూథరుండుట.

దైవనిర్ణయ ప్రకారము శతాబ్దమారంభమున లూథరు ద్వారా సంఘమున కెట్టి కార్యములు కొనసాగ వలె

సనెడి తలంపు లేకనే లూథరు పదునారవ శతాబ్దములోఁ బ్రవేశించెను. తనతండ్రిగారి యింటిలోఁ గొన్ని మార్పులు గలిగెను. దేవుఁడు తన తండ్రిగారి కష్టమును ఫలింపజేసెను. కష్టపెలమ్ముకొనిన పేదవాఁడు భాగ్యవంతుఁడాయెను. తనకు స్వంతముగా రెండుకొలుము లుండెను. మఱియు దన మంచితనమును బట్టియుఁ దెలివితేటలబట్టియు మాన్సుఫెల్డుపట్టణమునకు "కౌన్సిలరు"గా నేర్పాటు చేయబడెను.

హాన్సు లూథరు తన కుమారుఁడు గొప్పధర్మశాస్త్రపండితుఁడగునని నిరీక్షించెను. ఈ యుద్దేశము నెరవేరుటకై 1501 లో ఎర్ఫర్డు విశ్వవిద్యాలయములో మార్టిను పదిహేనవయేటఁ జేరెను. తన తండ్రితనకుఁగావలసిన దంతయు బంపించుటకై కష్టపడుచుండెను. తదుపరి లూథరిట్లనెను. "ప్రేమతోను, నమ్మకముతోను, నాతండ్రి నన్ను ఎర్ఫర్డులో నుంచెను– నేనేమైయున్నానో యది మాతండ్రిగారి కష్టము, చెమటవలననై యున్నానని"నుడివెను. లూథరువిశ్వవిద్యాలయములోఁ జేరినపుడు, కళలనుగూర్చి చదువుటారంభించెను. అతడితర గ్రంథములను కూడఁజదివెను "బాగుగా ప్రార్థించుట సగముచదువు ముగించినట్లే యను" నాశయమును తనముందునుంచు కొనెను. తనపనినిఁ బట్టుదలగల ప్రార్థనతో నారంభించెను. తనవిశ్రమ కాలమును విశ్వవిద్యాలయ భాండాగారములో గడిపెడివాఁడు. దానిలోగల

గ్రంథములను పరిశీలించుచుండఁగా లాటిన్ భాషలో నున్న గ్రంథమును గనుగొనెను. ఇరువది సంవత్సరములు క్రైస్తవ లోకమున నుండెను గాని మొదటిసారిగా నిప్పుడే బైబిలును జూచెను. అతఁడూహించిన దానికన్న నెక్కువయోగ్యగ్రంథము నందుఁ గనుగొనెను. ఆదివారమున చదువఁబడిన సువార్తలు పత్రికపాఠములు మాత్రమే దైవగ్రంథమని యతఁడూహించెను. దైవగ్రంథములోని పుటలనుఁ ద్రిప్పుచుండగా 'ప్రార్థన, వలని నొక్కకుమారుని పొందెనో యట్టిభక్తిగల 'హాన్నా, చరిత్ర తనకంటఁబడెను. గొప్ప యుద్రేకముతో దీనిజదివియట్టి గ్రంథమును దేవుఁడు తనకు లభింపఁజేయునని లూథరునిట్టూర్పు విడిచెను. ఇట్టిది తనకును క్రైస్తవలోకమునకును నను గ్రహింపఁబడెనని తలంచెను.

లూథరుయొక్క తెలివి తేటల వలన 1503 లో ననగా ఇరువదవయేటను బి. ఎ. రెండుసంవత్సరముల తరువాత ఎం.ఎ గెలుచునట్లు దేవుడతని నాశీర్వదించెను. విశ్వవిద్యాలయము లో బోధించుటకతని కవకాశము కలిగెను. ఈగౌరవము కలుగక ముందే యతని ప్రయాసయంతయు వ్యర్థమైనట్లాయెను. ఎక్కువపనివలన చాలాజబ్బుపడి చనిపోవుదునని తలంచెను- ఒకప్పుడొక వృద్ధుఁడైనపూజారి దేవుఁడు పంపినట్లుగా నతని వద్దకు వచ్చి యోదార్చియిట్లనెను. "ధైర్యముగా నుండుము- నీవు చనిపోవవు. దేవుఁడనేకులనోదార్చుటకు నిన్ను

హెచ్చించనైయున్నాఁడు." దేవుఁడెవరిని ప్రేమించునో, యెవరిని నొక ప్రత్యేకమైన పనికుపయోగించునో యట్టివారిమీద శిలువపెట్టను. అట్టిశిలువ నోపికతో మోసినవారు గొప్పఁనుభవము పొందుదురని చెప్పెను. లూథరు జబ్బునుండి తేలెను. మొదటినుండి నీతిప్రవర్తన గలిగియుండెను. సంఘముయొక్క కట్టుబాటులన్నియుఁగడుజాగ్రత్తతో నెరవేర్చెను. ప్రసంగము లనేకములువిని యుండెను. కడుజాగ్రత్తతో నతఁడు చదివియుండి, గొప్పజ్ఞానమును సంపాదించెను. అయినను మరణద్వారబంధములయొద్ద నిలఁబడి నట్లతఁడు గ్రహించెను. దేవుని యోదార్పు లేనియెడల మరణభయము నిత్యత్వముయొక్కభీతి వెంటాడునని గ్రహించెను. రానున్న భీతి తప్పించుకొనుట కేమిచేయవలెను! అప్పటినుండి తన మనస్సునందు గొప్పభావోద్రేకములు జనించెను.

## 3 లూథరు మఠములో చేరుట.

దైవనిర్ణయము, దైవకృపయు లూథరు యెడల తీరిపోలేదు. లూథరుయొక్క ముఖ్యస్నేహితులలో నొకరు, అకస్మాత్తుగా జబ్బుపడి భయంకరమైన మరణమును బొందెను. అందువలన నీలోకపు జీవితము వదలి నిత్యత్వమువైపునకు చూచుచుండెను. కొలదికాలములోనే క్రొత్త భయోత్పాతములుద్భవించెను. తనస్వగ్రామమునుండిమరలి ఎర్ఫర్టు సమీపమునకు రాగా గొప్పతుఫానొకటి వచ్చెను. లోకమంత

మొందునట్లు మెఱపులు మెరసెను ఉరుములురిమెను. దైవో
గ్రతను గ్రహించినవాడై ప్రతిమెఱపున్ను దైవనిర్ణయమును
జూపించినట్లతఁడు తలఁచెను. నరక బాధలు తన అంతరాత్మకు
గోచరమైయుండెను. దైవోగ్రతను తగ్గించుటకై బలినర్పించ
నుద్దేశించెను– మఱియు సన్యాసినగుదునని నిర్ణయించుకొనెను
తుఫాను తగ్గెను. లూథరుచేసిన ప్రతిజ్ఞయు, పంతము నిలిచి
పోయెను. 1505 జూలై 17 సాయంత్రము తన ముఖ్యస్నేహి
తులందఱిశెలవు తీసికొని, ఆరాత్రి అగస్టీనియన్ మఠమునకు
వెళ్లి తలుపు కొట్టెను. దానిలోని కతఁడు చేర్చుకొనబఁడి
అప్పటినుండియు లూథరు సన్యాసియై యుండెను.

లూథరు తన, ఉద్దేశమును గూర్చి తండ్రితోఁ జెప్పలేదు.
సన్యాసుల సోమరిజీవితము, తన తండ్రికిష్టము లేదనియు, తన
కుమారుడిట్టి జీవితములో ప్రవేశించ నిష్ట పడఁడని లూథ
రెరుగును. కాని తండ్రియెడల కుమారుఁడు చూపించవలసిన
ప్రేమనుబట్టి తనతండ్రికెదురు చెప్పఁకూడదన్నప్పటికి, ప్రతిజ్ఞ
యనునది నాల్గవయాజ్ఞకన్న నెక్కువని పోపులు బోధించిరి.
కాబట్టితానేమిచేసెనో? ఎందుకట్లుచేసెనో? కారణము దెలు
పుచుఁ దనతండ్రికొక యుత్తరము వ్రాసెను. తండ్రికిష్టము
లేనందునఁ గోపమువచ్చి తనకుమారునితోఁ గొంతకాలము
వఱకు సంబంధము లేకుండాయుండెను.

తీరికగా తనకాలమును గడుపుటకు లూథరు మఠములోఁ జేరలేదు తద్వారా దేవునికెక్కువసేవచేయుటకును, మోక్షము సంపాదించుకొనుటకును మఠములోఁ జేరెను. మఠములోఁజేరకముందు దనకోరిక ప్రకారము బైబిలొకటి లూథరుకివ్వఁబడెను. దానిని నిత్యముఁ జదువుచుండెను. పొట్టనింపుకొనుటయే ప్రధానముగాఁదలంచిన యితరసన్యాసులకిది కష్టముగానుండెను. వారతనితో "భిక్షాటనవలన నిదిపోషింపబడుచున్నది. కాని చదువుటవలనఁగాదు. కాబట్టి నీవొక పాత్రను దీసికొని, ఊరివెంబడివెళ్ళిరమ్మ"నిరి. అట్లే లూథరింటింటికివెళ్ళి రొట్టె, వెన్న గుడ్లు మొదలగునవి సాధారణ సన్యాసివలెనే భిక్షాటనచేసెను. గంటకొట్టుట, గుడితుడుచుట ఇతరసన్యాసుల గదులను తుడుచుట, మొదలగు సేవకావృత్తులన్నియు లూథరుచేసెను విశ్వవిద్యాలయాధికారుల, ఒత్తిడివలన లూథరు కేర్పాటు చేయఁబడిన పనులన్నియు మాన్పించబడెను. అప్పటినుండియు నతఁడు బైబిలును శ్రద్ధతోఁ జదువుటకవకాశము గలిగెను. సంఘపితామహులు వ్రాసిన గ్రంథములన్నియు, మరిముఖ్యముగా అగస్టిన్ వ్రాసినగ్రంథములను, అన్యవేత్తలలో అరిస్టాటిల్ వ్రాసిన గ్రంథములును లూథరు కడుజాగ్రతతోఁ జదివెను.

చదువులో నెక్కువగా మునిగిపోయినందున ప్రార్థన సమయములను గుర్తించలేదు. మఠముయొక్క చట్టముల

నిరాకరించ నిష్టములేక తనకునియమింపఁబడిన ప్రార్థనలను జేయుటకై దివారాత్రములు తనగదిలో గడివేసికొని ప్రార్థించెను. లోన ప్రార్థనలు, ఉపవాసములు, జాగ్రతల, వలనఁ దనయారోగ్యమునకు భంగము కలిగెను- ఒకసారి తనగది, మూడు దినముల వఱకు గడియవేయబడినపుడు, బలవంతముగాఁ దలుపును బగులఁగొట్టిలోనికి వెళ్లి చూడఁగా లూథరు నేలమీద మూర్ఛజెంది పడియుండెను. వాద్యమువలన నతడు లేపఁబడెను. ఎందుకనగా లూథరునకది యెంతో ప్రీతి. ఏసన్యాసియైన మఠములోని జీవితమును గంభీరముగాఁ దలంచినయెడల, ఆతడు లూథరైయుండెను. తదుపరియతడిట్లనెను. "నేనుభక్తిగల సన్యాసినన్నమాట నిజమే. మఠము యొక్క చట్టములన్నియు నెరవేర్చితిని. అందువలననే, మోక్షములభించిన యెడల నాకును మోక్షము లభించెడిదే. మఠములో ప్రార్థనలు, ఉపవాసములు, జాగ్రతలతో మరణముపొందు వఱకు శిక్షణలో నుండెడి వాఁడను" అనియనెను.

ఈ రీతిగా క్రైస్తవలోకమునకు జీవజలముల యూటను దెరువగలవ్యక్తి, దైవనిర్ణయము వలన, మానవులు కట్టిన చిల్లితొట్లెల నిరుపయోగము ననుభవపూర్వకముగాఁ దెలిసికొనెను. విశ్వవిద్యాలయజ్ఞానము, దైవజ్ఞానము మఠముల పవిత్రతలన్నియు నిర్జలయెడారిలోని సంచారివలెనుండెను.

క్రీస్తు ప్రసాదించెడి కొన్ని చోట్ల నీళ్ళయినను, తృష్ణ గొన్న యాత్మకు సంతుష్టికలుగఁజేయునని తన దౌర్భాగ్యస్థితిని నతఁడు గ్రహించెను. దేవుఁడొక ముసలిసన్యాసిని 'అపొస్తలుల' విశ్వాసప్రమాణములోని పాపక్షమాపణ మున్నదని నమ్ముచున్నాను, అనెడి సందేశమును లూథరు దగ్గరకు తీసికొనివెళ్ళెను. అట్టిక్షమాపణ కేవలము దైవకృపమీఁదనే యాధారపడి యున్నదని చెప్పెను. ముఖ్యముగా డాక్టరు "శాన్ స్టాపిట్జు" అనునాతఁడు లూథరునకు క్రీస్తు యొక్కమార్గ దర్శిగానుండెను. తురింగియా, మెయిసెన్ పరగణాలలోనున్న అగస్టీనియన్ క్రమమునకు డాక్టర్ స్టాపిట్జువికార్ జనరలుగా నుండివానిలోని మఠములన్నిటిని దర్శించెను. ఒకసారి ఎర్ ఫర్టులోని మఠములో నిరాశచెందిన యొకయావనసన్యాసి నతఁడు గాంచెను. అట్టినిరాశకు గారణము లూథరువలనఁ దెలిసికొనిన తరువాతనతని కలతచెందిన యాత్మనుగూర్చి జాలిపడెను. క్రీస్తుద్వారా దేవునియొక్క కృపనతడెరుగకున్న దైవగ్రంథమువైపునకును, శిలువవేయఁబడిన క్రీస్తుకును ఆయననీతి వైపుకు లూథరునతఁడు మళ్లించెను. అప్పటినుండి లూథరు బైబిలు నెక్కువగాఁ జదువుటవలన నెక్కువలాభమును గ్రహించెను. సువార్తవలనఁ గలిగెడి ఓదార్పును గూర్చి బహుతేటతెల్లమాయెను.

1507 వ సం॥లో లూథరుగురువుగా నభిషేకింపఁబడెను. మాన్సుఫెల్డునుండి లూథరుతండ్రి యభిషేకమును జూడ వచ్చెను. అభిషేకారాధనానంతరము, భోజన సమయమున, లూథరు జీవితమునుగూర్చి 'అగస్టినియన్' క్రమములోని కొందఱుసన్యాసులు, తనతండ్రి సమ్ముఖమునఁ బొగడిరి. లూథరు సన్యాసి యగుట తండ్రి కిష్టపడనందుకు వారు విస్మయ మొందిరి. హాన్సులూథరు 'అయ్యలారా, నీతండ్రిని, నీతల్లిని సన్మానించ వలెనని వ్రాయఁబడిన విషయము మీకుదెలియునుగదా! తల్లిదండ్రుల గౌరవపరచ వలెనన్నయాజ్ఞను మీరు మఱచిపోయినారా?" అనియనెను. ఈ మాటలు లూథరుయొక్క మనస్సాక్షికి మఱియొక ముల్లు వలెనుండి, తన సన్యాసి జీవితమంతటిలో నీమాటలను మఱచిపోలేదు.

## 4. విట్టెన్ బర్గులో లూథరుండుట.

లూథరు హృదయములో వెలిగింపఁబడిన విశ్వాస దీపము సన్యాసియొక్క గుహలో వెలుగుటకుఁ గాదుగాని యది గొప్పజ్యోతివలె ప్రకాశించి, పోపుల చీకటి నంతటిని పారఁదోలుట దైవచిత్తమైయుండెను. వెలిగించబడిన దీపము కుంచము క్రిందనుండి తీసివేసి దీపస్తంభముమీద బెట్టవలసి వచ్చెను. ఈ రీతిగా జరుగుటకు దేవుఁడిదివఱకే యేర్పాటు చేసెను.

1502లో శాంగ్జన్ దేశపు ఎలాక్టార్ ఫ్రెడెరిక్, డాక్టరు స్టాపిట్జుగారి సహాయమున విట్టెన్‌బర్గు పట్టణములో నొక విశ్వవిద్యాలయమును స్థాపించెను. అందుపన్యాసకులు, తగు సమర్థులు. కాని 1508 లో నూతనోపన్యాసకులు కావలసి వచ్చెను. డాక్టరు స్టాపిట్జు ఎర్‌ఫర్టు సన్యాసిని సిఫారసు చేసెను. సంవత్సరాంతమున లూథరు తర్కశాస్త్రోపన్యాసకులుగాఁ బరిగణింపఁ బడెను. చివరకు విట్టెన్‌బర్గు చేరెను ఆపట్టణములోని అగస్టీనియన్ మఠములో మకాము చేసెను. తర్కశాస్త్రమును బోధింప నేర్పాటు చేయఁబడలేదు గాని తన సమర్థతయంతయుఁ జూపించి దానిని బోధించెను. అతని బోధనా పద్ధతివలన ననేకమంది యాకర్షింపబడిరి. కాని తర్క-శాస్త్రముసందుతీక్ష్ణుడైన వాఁడు కాదు. కాని తనకు నచ్చిన శాస్త్రము, వేదాంతము. అట్టిశాస్త్రమువలన నతఁడు గింజలోని పప్పును, పొట్టులోని గోధుమను, ఎముకలోని మూలిగను బైటకు లాగెడివాఁడు. అతనికి శాస్త్రములన్నింటిలో వేదాంతము రాణివంటిది. దైవగ్రంథముమీద గూడఁ గొన్ని యుపన్యాసములిచ్చెను.

డాక్టరు స్టాపిట్జుగారు లూథరును బోధింపుమని బలవంతము చేసెను. కాని దేవుని స్థానములోనుండి బోధించుట దుస్సాధ్యమైనపని యని నుడివెను. కాని తన యధికారుల మాటప్రకారమంతయు ప్రసంగించ వలసి వచ్చెను. నుతా

బోధించిన చిన్న సంఘము, అగస్టీనియన్ మతమునకుఁ జెందినది. బెత్లెహేములోని పశువులపాక రూపముచెంది ముప్పది యడుగుల పొడవు, నిరువది యడుగుల వెడల్పుగల కఱ్ఱతోఁ జేయఁబడిన గుడిసైయుండెను.

లూథరు యొక్క ప్రసంగములనుబట్టిచూడఁగా నతఁడు ఎర్ ఫర్టులోఁ జేసిన దైవగ్రంథపఠనము వృథాకా లేదని తేలెను. దైవవాక్యమును పరిశీలించి, బరిశీలించి తేల్చినగుజారేమనగా "నీతిమంతుఁడు విశ్వాసమూలమున జీవించును." లూథరునకు దైవగ్రంథమునందుఁగలిగిన జ్ఞానమువలన విశ్వవిద్యాలయము లోని విద్యార్థులందఱు, ఆగుడిలోఁ చేరు సంఘస్థులందరు, దైవసహాయమున, నెక్కువ మేలుపొందిరి. అనేకులతనిని గొనియాడిరి. డాక్టరు పోలిచ్ అను విశ్వవిద్యాలయపు పురోహితుఁడు ఈవిధముగా బ్రవచించెను. 'వేదాంతనిపుణు లందఱిని గెలిచి నూతన సిద్ధాంతమును సంఘములోఁ బ్రవేశ పెట్టి రోమాసంఘమంతటిని దిద్దుబాటు చేయఁగలఁడు. ఎందు కనగాఁ నతఁడు అపోస్తలుల ప్రవక్తల వ్రాతల మీదనే యాధారపడియుండి, క్రీస్తువాక్యమునే ప్రధానముగాఁ జేసి యున్నాడు. అట్టిసిద్ధాంతము నెట్టితర్కశాస్త్ర మోడించలేదు.

## 5. లూథరు రోమాపురికిఁ బ్రయాణమగుట

తలంచని రీతిగా విశ్వవిద్యాలయములో లూథరు చేయుచున్న పనికాటంకము కలిగెను. అగస్టీనియన్ మత

ములో నొక వివాదము వచ్చెను. దానిని రోమాపురిలో నున్న పోపుగారి యాజమాన్యమున మాత్రమే తీర్చవలసి వచ్చెను. ఆమతమునకుఁ జెందిన యొక సమర్థుఁడైన సభ్యుఁడా వివాదమునకుఁ బాల్గొనవలసి వచ్చెను. అట్టి యెన్నిక విద్యాధికుఁడైన మార్టిన్ సోదరుని మీదఁ బడెను. పరిశుద్ధపట్టణములోఁ గాలు పెట్టుచున్నాను గదా యని లూథరు చాలా సంతోషించెను. ఎందుకనఁగా రోమాపురిలో సింహాసనాసీనుఁడైయున్న దైవప్రతినిధి సాక్షాత్తు భూలోకముయొక్క మోక్షస్థానమనుకొనెను. అక్కడకు లూథరు కాలి నడకనే వెళ్ళెను. కాని యసహ్యమైన, యాశ్చర్యమొకటి తటస్థమాయెను. ఇటలీ దేశపు సరిహద్దులలో నడుగు పెట్టఁగా నా దేశపు మఠములు రాజుల నగరములను మించిన సుఖభోగములనుభవించు చుండెను. పరిశుద్ధ పట్టణములో నైన క్రమముండవచ్చు ననుకొనెను. ఆ పట్టణశిఖరములు, గోపురములను వీక్షించి నపుడతఁడెంతో గౌరవముతో మెలఁగెను. చేతులుచాచి, సాష్టాంగ నమస్కారము చేసి 'పరిశుద్ధపట్టణమా, నీకునమస్కారము" అని నుడివెను. పట్టణములోఁ బ్రవేశించినపు డేమికనుగొనెను? సంఘోద్యోగములఁ గొనుటయు, నమ్ముటయు జరుగుచుండెను. గురువులలో దుర్వ్యయము, దుష్పరిపాలన యున్నట్లు కనుగొనెను. పీఠమువద్ద గురువులు జపములను, అర్థములేక వల్లించెడి 'ఎక్క' ముల

వలె నగారవముగ, వల్లించుచుండిరి. పరిశుద్ధపట్టణమును గూర్చిన వానినన్నిటినిమిత్తమై యీభక్తిగల సన్యాసియొక్క యంతయు గగుర్పాటు చెందెను.

భోజన సమయమున పరిశుద్ధప్రభు రాత్రిభోజన సంస్కారమును గూర్చి వేళనగా నొకగురువు మాట్లాడుట లూథరు వినెను. "రొట్టెవు నీవురొట్టెగానే యుండుము. ద్రాక్షారసము, "నీవట్లేయుండుము" అనియొక గురువునుడివెను. రోమాపురిలో లూథరనేక జపముల నుచ్చరించుదలచెను. ఎందుకనగా నవి సరిగానుచ్చరింపబడుట లేదు. వాటినతడెంతో భక్తితోను, భయముతోను జదివెను. అతడు ముగించకముందేయితరులు ముగించి "త్వరపడు, పరిశుద్ధమరియమ్మ తన సుతుని తొందరగా సంగీకరించవలెను" అనితొందరచేసిరి. అప్పటికిని లూథరు కండ్లు తెరువలేదు. తరువాత దనయాగమనమునుగూర్చి యిట్లనెను. "నేనును రోమాపురిలో (బిచ్చి నమ్మకముగల సన్యాసివలె "బట్టణములోనున్న గుడులన్నిటిని స్మశానములన్నిటిని దర్శించితిని. నాతల్లిదండ్రులు సజీవులై యుండిరి. లేనియెడల బర్గేటరీనుండి వారిని విముక్తిచేయు వఱకు నేనుజపతపముల నాచరించెడి వాడన"నియనెను.

రోమాపురిలో నొకప్రత్యేకమైన వస్తువుండెను. దాని దీవెన నతడు పొందగోరెను. అదేదనగా పొంతిపిలాతు తీర్పుచెప్పినపుడు క్రీస్తున్యాయస్థానమునకు నెక్కిన మెట్లు

(Stair case) ఈమెట్లనప్రతకీతిగా ఎరూషలేమునుండి రోమా పురికిఁ దీసికొనిపోఁబడెనని చెప్పెడిగాథ గలదు. ఎవ్వరు మో కాళ్ళమీద నీమెట్ల నెక్కెదరో వారికి సంపూర్ణ పాపపరి హారము కలుగునని బోధించిరి. లూథరీమెట్ల నెక్క ప్రారంభిం చగా 'నీతిమంతుఁడు విశ్వాసమూలముగా జీవించును' అను సత్యము తన హృదయమునందు వినబడెను

లూథరు విచారముతోఁ బరిశుద్ధ పట్టణమును వదలి తన స్వస్థానమగు జర్మనీచేరెను. 'బలోగ్నా' అను పట్టణములో లూథరు జబ్బుపడెను. మరణావస్థలో నుండెను. మరల "నీతిమంతుఁడు విశ్వాసమూలమున జీవించును" అని యుదయకాల నక్షత్రమువలె దన హృదయమందు బ్రవేశిం చెను. తరువాతనతఁడిట్లనెను. "నేను మరల జన్మించినట్లా యెను. పరదైసునకు నూతనమార్గమేర్పడెను. దైవగ్రంథము నూతనముగా నగుపడెను."

యీరీతిగా లూథరు రోమాపురియొక్క క్రియమంత టిని జూచెను. దేవుని మహాకృపనుగూడ గుర్తించెను. సువా ర్తప్రకాశమూన మిదివఱకు కంటె మఱియు నెక్కువగాఁ బ్రకాశించెను. తరువాతి కాలములో రోమాపురిని జూచుట వలన లూథరున కట్టియనుభవము, తన పోరాటములోఁ జాల నుపయోగపడెను. ఎంత, రోమాపురికి సమీపముగా నుండు రోయంత క్రైస్తవ జీవితమునకు దూరస్థులని గ్రహించెను.

6 లూథరు వేదమునందు డాక్టరు అను బిరుదు నొందుట.

రోమాపురినుండి తరలి వచ్చిన తరువాత లూథరు తన కర్తవ్యమును గడు జాగరూకతతోఁ జేయుచుండెను. లూథరునకు దేవుడనుగ్రహించిన గొప్పవరములను గూర్చి స్టాపిట్జునకు నచ్చెను. దేవుని మహిమార్థమును, సంఘ శ్రేయస్సు నిమిత్తమును నట్టివరముల నెట్లు పయోగపడ్చవలెనాయని యతఁడాలోచించెను. మఠములోనున్న 'పేరి' చెట్టుక్రింద నదెట్లు సాధ్యమో? యను దాని విషయమై యతఁడు లూథరునకుఁజూపించెను. అదెట్లనగా వేదమునందు 'డాక్టరు' అను బిరుదు నొందుటవలననే. కాని లూథరు వినయముతో 'దానా పదవి కనర్హుడనని' నిరాకరించెను. 'నేనాపదవి కనర్హుడనని పదిహేను కారణములఁ జూపించితిని. కాని స్టాపిట్జువానిని నిరాకరించెను. అని లూథరు చెప్పెను. చివరకు స్టాపిట్జుతో లూథరిట్లనెను. 'నన్ను జీవితాంతమొందించేటట్లున్నావు. మూఁడు నెలలుకూడ జీవించను. అంతట స్టాపిట్జుఁ దేవుని పేరిటజరిగిన జరుగనిమ్ము. ఆలోకములోఁకూడఁ దెలివిగలవారు కావలసి యున్నారు' అని యనెను. లూథరు సన్యాసియైనపుడు చేసిన ప్రమాణమును జ్ఞాపకముచేసి, పెద్దలకు జూపించవలసిన, విధేయతను గోరెను. మఱియు "డాక్టరు" బిరుదను నొందుటకగు ఖర్చంతయు "ఎలెక్టరు ఫ్రెడిరిక్ భరించుననని తెలియఁబరచెను.

పరి. లూకా దినమగు 18 అక్టోబరు 1512 న లూథరు

వేదాంత బిరుదము "డాక్టరు" పదవిని బొందెను. తనజీవితమంతయు దైవగ్రంథమునుజదువుచు, బోధించుచు క్రైస్తవవిశ్వాసమును గాపాడుచున్నదియు, వ్యతిరేకముగా వ్రాయఁబడు వ్రాతలన్నింటిని ధిక్కరించెదననియు నతఁడు వాగ్దానము చేసెను. తనకుఁ దరువాత లోపల బైటనుండి వచ్చిన శోధన సమయములన్నిటిలోను దాను చేసిన ప్రతిజ్ఞను జ్ఞాపకముచేసికొని తృప్తిచెందెడి వాఁడు.

ఇప్పుడు లూథరు వేదాంతమునందుపన్యాసకుఁ డయ్యెను. వేదముబోధించురీతిని పరివర్తించెదనని చేసిన ప్రమాణమును నిలబెట్టెను మొదట సంకీర్తనములను దరువాత రోమాపత్రికనుగూర్చి బోధించెను. అతఁడు పరిశుద్ధాత్మచే బోధింపబడి పరిశుద్ధాత్మశక్తితోనే యితరులకు శక్తితో బోధించెను. తన జీవితములో దేని ననుభవించెనో, తనహృదయమందు దేనిని విశ్వసించెనో దానినే బోధించెను. ధర్మశాస్త్రమతనికి ధైర్యము కలుగఁజేసెను. కాని సువార్త క్రీస్తుయేసువలన దేవుని యపారకృపను విశ్వాసము ద్వారా ధైర్యపరచెను. ఈకారణమున దేవుని వాక్యమును రెండుభాగములు చేసెను. అతఁడు గొప్ప యుపన్యాసకుఁడు మాత్రమేగాక గొప్ప ప్రసంగియునై యుండెను. "విట్టెన్బర్గు పట్టణసభ లూథరును "ప్రసంగికుని"గా నియమించుకొనిరి. ప్రసంగపీఠమునుండి వేదపరాయణుని వలెనే బోధించెను, ధర్మ శాస్త్రము

వలన మానవుని యొక్క మంచితనము దేవుని యొద్ద హేయమనియు, నందువలన దైవకృపమీద నాధారపడుట యెక్కలి యవసరమనియు బోధించెను. సువార్తద్వారా, విరిగినలిగిన యాత్మలను క్రీస్తురక్షకుని యొద్దకు నెట్లు చేర్చవలెనో లూథరు గ్రహించియుండెను. మానవులలోగల, భయము, అనుమానమంతటిని బారదోలి పరిశుద్ధ నందానంద మొందుటకు నట్టియాత్మలను దేవునిట్లు లూథరు త్రిప్పఁగలిగెను. అతని బోధలు గద్దురు పాటును గలుగఁజేసి, యనేకుల నాకర్షించెను. అట్టి ప్రసంగము లాదినములలో వినఁబడనే లేదు.

1516 సం॥ యొక్క వసంతకాలములో డాక్టరుస్టాపిట్జు "నెదరులాండ్సుకఁ" బ్రయాణమైపోయెను. ఆయనకు బదులు లూథరు మఠములనన్నిటిని దర్శించవలసి వచ్చెను తాను వెళ్ళిన ప్రతిచోటను విషాదకరమగు పరిస్థితులు, క్రీస్తునందుఁగల రక్షణనుగూర్చిన యజ్ఞానము, మానవయత్నములు, సత్క్రియలు మొదలగు వానినిమాత్రమే యతఁడు చూడగలిగెను. తాను వెళ్ళినచోట్లనెల్ల మంచివిత్తనముల జల్లినది సత్యానే అతఁడు క్రీస్తును విశ్వసించెను. అందువలన జీవ, జలయూటలు ప్రవహించవలసి యుండెను.

# తృతీయ భాగము

## దిద్దుబాటుయొక్క ప్రారంభదశ

### 1. పాపపరిహార పత్రికలు, 95 సిద్ధాంతములు:-

రోమాపురిలో సెంటుపీటర్సు దేవాలయమును గట్టుటకై పదియవ, లియోపోపుగారికి ధనావసరముండెను. దానినెక్కడనుండి తేగలడు? పాపపరిహార పత్రికల వలన దనపూర్వీకుల కుపయోగముగా నుండెను. అతనికిమాత్ర మవెందుకు నుపయోగించవు? ఆల్బర్టు, మేయెన్సు పట్టణ ఆర్చిబిషప్‌గారికిని ధనావసరముండుటవలన, జర్మనీదేశములో నొకభాగమున నీపరిహార పత్రికలనమ్మెడి వృత్తిలో పాల్గొని కొంతలాభ మార్జింప దలచిరి. డామినికన్ క్రమమునకుం జెందిన జాన్ టెట్జెల్ అనుసన్యాసి దేశమంతట దిరిగి యీపాప పరిహార పత్రికలనమ్ముట కేర్పాటు చేయఁబడెను. అతఁడిది వఱకు వ్యభిచార కారణమున మరణశిక్ష విధింపబడి, క్షమించబడినవాఁడు. ధనముకు పాపపరిహారపత్రికలనమ్ముట దేవుని కృపయని ప్రజలకు బోధించెను. సంపూర్ణ పాపపరి హారము పత్రికలద్వారా కలుగునని యతఁడు బోధించెను. నిత్యజీవము పొందుటెంత సులభము! బంధువులనుగూడ పర్గేటరీనుండి తప్పించగల సులభమార్గము. డబ్బును చెల్లిం

చిన వెంటనే బంధువులకు విముక్తి దొరకునని యతఁడు బోధించెను.

ప్రతిపట్టణములోను టెట్జెలు గొప్ప యాడంబరమయిన రీవితో బోధించెను. దేవాలయపు గంటలు మోగుటద్వారా ప్రజలు, గురువులు, న్యాయాధికారులతో, టెట్జెలును గలసికొననారంభించిరి. అతఁడు పోపుగారు ధరించు వస్త్రమును ధరించి యెఱ్ఱని శిలువతో శృంగారించుకొనెను. ఈ శిలువ క్రీస్తుశిలువ యంతపని చేయగలదని బోధించెను. పరిపేతురు స్థానముకూడ నతఁడపేక్షించు ననియెను. ఎందుకనఁగా పేతురు తనసువార్తద్వారా రక్షించినవారి సంఖ్యకన్న, దన పత్రికద్వారా నెక్కువమందిని రక్షించితినని బడాయికొట్టెను. తన కర్తవ్యమును గొనసాగించుకొనగల, సమర్థుఁడు— కొన్ని రూకల నిమిత్తము తమయాత్మల రక్షణనుగూర్చి నిర్లక్ష్యము చేయవద్దనిచెప్పి "రండి, రండి" అని బిగ్గరగా కేకలువేసెడివాఁడు. ప్రజలు వచ్చి, తమధనముతో విలువలేనియా పత్రికలను గొనిరి.

టెట్జెలు విట్టెనుబర్గు పట్టణ సరిహద్దులకు రాకముందే లూథరు వాని వ్యాపారమును గూర్చి ఖండించెను. క్రీస్తు, పీరులకును, అంత్యక్రీస్తుపీరులకును గలహమారంభమాయెను. విట్టెన్‌బర్గు సమీపగ్రామమగు "జ్యూటరు" బంకునకు టెట్జెలు

రాగా విట్టెనుపట్టణ వాసులు కొందరాగుంపులో నుండిరి. పాపపుటొప్పుకోలు సమయమున గొందఱు తమ ఘోర పాపముల నొప్పుకొనఁగా లూథరు వారిని పశ్చాత్తాపపడుమని మందలించగా వారవసరము లేదని తెలిపి తాము కొనిన పరిహార పత్రికలను లూథరునకుఁ జూపించిరి. వారివిమోచనమును లూథరు ప్రకటించినపుడు, వారు వెళ్ళి టెట్జలుకుఁ దెలియఁ బరచిరి. అంతటనతఁడు భిన్నమతాభిప్రాయముగలవాఁడను నేరస్థాపన చేయుదునని లూథరును బెదిరించెను. లూథరు విచారమగ్నుడై, ఇట్టియపకీర్తిగల వృత్తిని నివారించుటకై దేవుని పేర, సమరమున దిగసమకట్టెను.

సకల పరిశుద్ధుల దినమగు 1517 అక్టోబరు 31 న విట్టెన్‌బర్గు దేవాలయపు తలుపులకు 95 సిద్ధాంతములను పాపపరిహార పత్రికల నిరోధించుచు మేకులతోఁ గొట్టెను. బహిరంగ సభలో వానిని నిరూపించెదననియు వ్రాసెను. పోపుగారి నెదరింప నుద్దేశించలేదని తెలియఁబరచెను. ఎందుకనఁగా టెట్జెలు చేయునది పోపుగారికిఁ దెలియకుండనే చేయుచున్నాఁడని లూథరు భ్రమించెను. ఆసిద్ధాంతములలోఁ బాపి యే విధముగా బత్రికల సహాయము లేకనే పశ్చాత్తాపము వలనఁ గ్రీస్తుద్వారా దేవుని కృపను బొందగలఁడో చూపించెను. ముప్పది రెండవ సిద్ధాంతమిట్లుండెను. "పాప పరిహార పత్రికలమూలమున రక్షణగలదని నమ్మ

పరిశీలి వాఁడు వానిని బోధించెడి బోధకులతో సహా నిత్య నాశమునకుఁ బోవుచున్నాడు."

లూథరుయొక్క యెదిరింపు, గాలిని గొట్టుటవంటిది కాదు. ప్రభువులకుఁ బ్రభువు తనదీనసేవకుని కలమును సరిగాఁ నడిపించెను. ఈ మొదటి నిరోధనము పోపుల పరిపాలన నంతటినిఁ దల్లడిల్ల జేసెను. సిద్ధాంతముల ఫలిత మాశ్చర్యకరము; - మఱియు లూథరునకనుకోనని రీతిని జరిగెను. పదునాలుగు దినములలో జర్మని దేశమంతటికిని వ్యాపించెను. నాలుగు వారములలో యూరపుఖండమంతయు బ్రాకెను. లూథరుయొక్క పిరికిస్నేహితు లతనిగూర్చి గడ గడ వణకిరి. సత్యజ్యోతుల నాశించిన వారుత్సాహపడిరి. సత్యవిరోధులు విషమును, నిప్పును వెళ్లగ్రక్కిరి. లూథరు వ్రాసిన సిద్ధాంతముల వలన నెక్కువగా దెబ్బతినిన పదియవ లియోపోపుగారు, వాటిని గమనించనట్లు నటించి, సన్యాసుల తగాదాయని యెంచి, లూథరుయొక్క తెలివి తేటలకు మెచ్చుకొనెను.

కాని యీవిషయము దినదినము పెద్దదయ్యెను. టెట్జెలు లూథరునకు వ్యతిరేకముగా నొకపత్రము వ్రాసెను. విట్టెనుబర్గు సరిహద్దులను వదలి యెదురుడుకులులేని "ఓడరు" ప్రాంతమునకుఁ జెందిన ఫ్రాంకుఫోర్టునకు, టెట్జెలు తరలెను. లూథరును నిరోధించినవారిలో "ఫ్రాంకుఫోర్టు విశ్వవిద్యాలయ

మునకుఁ” జెందిన క్యారాడ్ వింపిన రోమాపురిలోనున్న,
మినికన్ క్రిమమునకుఁ జెందిన సిల్వెస్టరు ప్రైయారి
హాస్, హుంగ్‌స్ట్రేటన్, ఇంగాల్‌స్టాడ్ విశ్వవిద్యాలయమునకుఁ
ందిన డాక్టర్ జాన్ ఎక్, అనువారు ముఖ్యులు. వీరికి జవా
చ్చుటలో దేవుని వాక్యము లూథరు వృథాగా జదువ
దనియు, దేవుఁడనుగ్రహించిన కృప నిరర్థకము కాలేదని
లాథరు నిరూపించెను. విరోధులను ధిక్కరించుటలో లూథ
రుభజ్ఞునివలె ప్రవర్తించి విశ్వాసమును స్థైర్యమును
గాపెను. విశ్వాసఖడ్గము నెంతో జాగ్రతగా బట్టుకొనివచ్చె
నఁగా విశ్వాసి, లూథరు వ్రాసిన వ్రాతలను బ్వైయప్రశ్నముగా
ట్టివస్తాదు నిమిత్తమై దేవునికిస్తుతి చెల్లించెశివాఁడు. రోమా
రినాయకులు లూథరు నణచివేయఁజేసిన ప్రయత్నముల
లన లూథరు దేవుని వాక్యమును మరియు నెక్కువ చదువు
ట్లను సత్యము నెక్కువ, తనుగానునట్లును జేసిరి

## 2 లూథరు ఆగ్సుబర్గులో 'పోపు'గారి రాయబారుల యెదుట నుండుట.

ఈ విషయములు జరిగిన కొద్దికాలమునకే 1518
ప్రిల్ మాసమున హైడెల్‌బర్గులో జరిగిన సమావేశము
యందు తన విశ్వాససూత్రములను బలపర్చుటకుఁ దగాణను
కోరికెను. విశ్వవిద్యాలయోపన్యాసకులు నిరోధించినను

యూరోపవ వేదాంత పండితులు తమసూత్రములనే ప్రతిపాదించిరి. తరువాత దిద్దుబాటులో బనిచేసిన వారిలో ముఖ్యులుబూసర్ బెరింజ్, స్ట్రాఫ్, బిల్లికనస్, మొదలగువారు ప్రాముఖ్యులు. విట్టెన్‌బర్గునకు దిరిగివచ్చినతరువాత పాపపరిహార పత్రికలను గూర్చివ్రాసిన సిద్ధాంతములను నిరూపించునట్టి పత్రికయొకటి వ్రాసెను. మేనెల 3 వ తేదీని దానితోబాటు మఱియొక మర్యాదగల "ఉత్తరమును" వ్రాసిపోపుగారికి బంపెను. పోపు గారిని గూర్చియిప్పటివరకు సదుద్దేశమే కలిగియుండెను. అతఁడింక నెక్కువ తెలిసికొనవలసి వచ్చెను.

లూథరు వ్రాసిన యుత్తరమునకు జవాబిచ్చుటకు బదులుగా, ఆగష్టు 7 వ తారీఖున నరువది దినములలో మత భేదాభిప్రాయములు గలవాఁడన్న నేరమునుగూర్చి చెప్పు కొనుటకు రోమాపురిలో హాజరుకావలయునని సమ్మనుజారీ చేయఁబడెను. ఆసమ్మనుయొక్క ఫలిత, మేమైయుండునో చరిత్రవలన విశదమే. వెళ్లినవారు మరలఁ దిరిగి యింటికి రాలేదు. లూథరు రోమాపురికి వెళ్లియుండిన యెడల, దైవ గ్రంథమునుండి యెత్తిచూపిన నిదర్శనమునకు బదులు, బంది కానా, సంకెళ్ళులేక కొయ్యకు గట్టఁబడుట మొదలగు శిక్ష లకు లోనైయుండెడివాఁడు- విమర్శకుల చేతులలోఁబడిన యెడల నద్భుతమ మాత్రమే యతనిని రక్షింపగలిగియుండె డిది తనసంఘమునకు లూథరుద్వారా సహాయముచేయనుద్దే

శించిన దేవుడతనిని నరహంతకుల చేతులలో బడనియ్యలేదు. దేవుడు ఎలెక్టర్ ఫ్రెడెరిక్‌ను, లూథరును గాపాడుటకై యుపయోగించుకొనెను. అతని పలుకుబడివలన లూథరునుగూర్చి జర్మనీదేశములోనే, పోపుగారు విచారణచేయుట కనుమతి నిచ్చెను. కేసు విచారణ చేయుటకై "కార్డినల్ కజేటను" గారిని పోపుగారి యభ్యర్థిగా బంపబడెను.

కార్యములన్నియు ననుకూలముగా సంక్రమించినందుకు లూథరు సంతసించెను- అగ్జుబర్గులో, సహితము లూథరునకు క్షేమము లేదని యతని స్నేహితులక్కడికి గూడ వెళ్ళనెలవియ్య లేదు. కాని ధైర్యముతో నిక్కట్టుల నెదుర్కొన లూథరు వెళ్ళెను. - "అపనలూహ్యములు కావని పోపుగారి యభ్యర్థికియ్యబడిన యుపదేశములను, బట్టి కనుగొనవచ్చును. కాలవ్యవధిలేక లూథరును బట్టి, బంధించి, రోమాపురికి దీసికొనిరావలయునని ముందుగా నేర్పాటాయెను. లూథరును బంధించుట సాధ్యముకాని యెడల జర్మనీదేశమంతట నతని బహిష్కరించవలయునని యుత్తరువులు జారీచేయుటకు నభ్యర్థికి నుత్తర్వాలియ్యబడెను. చక్రవర్తిని మినహాయించి మిగిలిన రాజులను, సామంతులను, పట్టణములు పల్లెలు లూథరును జేర్చుకొనిన యెడల బహిష్కరింపబడునని ప్రకటన చేయుటకు నధికారమియ్యబడెను. లూథరును ఖండించుటకై, చక్రవర్తిని సామంతులను నైహికాయుధ్ధములైన శస్త్రులనన్నిటి

నుపయోగించుటకై యభ్యర్థికి నధికార మియ్యబడెను. మానవరీత్యా తలంచిన లూథరునకు దలదాచుకొనుటకు స్థలమెక్కడ? లూథరు కాలినడకను మఠీయుక సన్యాసి వస్త్రులు ధరించుకొని చేతడబ్బేమియు లేకనే ఆగ్జుబర్గునకుఁ బ్రయాణమై పోయెను. అక్టోబరు 7 వ తారీఖునకుఁ జేరి "అగస్టీనియన్" క్రిమమునకుఁజెందిన మఠములో మకాము పెట్టెను. సభముగిసిన తరువాత లూథరునుగూర్చి సంపూర్ణ జాగ్రత తీసుకొనటకై "కజాటన్" యాలోచించుచుండెను. చక్రవర్తిగారినుండి క్షేమముగాఁ బంపించెదమని యభయ మిచ్చెడి యుత్తరముండిననే తప్ప "కజాటన్" సన్నిధికివెళ్లఁ గూడదని స్నేహితులు సలహాలిచ్చిరి. ఈలోపుగా పోపుగారి యభ్యర్థులు లూథరు దగ్గరకుఁ గొందఱిని బంపించిరి. "సెర్రాలోంగా" అను జిత్తులమారియగు నిటలీ దేశస్థుఁడు మూఁడు శబ్దములు పలికినఁ జాలును. మిగిలినదంతయు మేము సమర్థించెదమని యభయ మిచ్చెను. కాని యతఁడు విరిగినరెల్లుతో మాట్లాడుటలేదని తెలిసికొనెను. సామంతులు రక్షించని యెడల, పోపుగారు బహిష్కరించిన యెడల నెక్కడుండెదవని వేసిన ప్రశ్నకు జవాబు "ఆకాశముక్రింద" అని లూథరు వెంటనే జవాబిచ్చెను. పోపున్ను, మిగిలిన గురువులున్ను నీ చేతికి దొరికినవారిని నీ వేమిచేయుదువు?" అని యడిగిన ప్రశ్నకు "నేను వారిని దగినరీతిగా మర్యాదతోను, గౌరవముతోను జూచెదను" అని లూథరు జవాబిచ్చెను.

మొదటి సారిగా అక్టోబరు 12 వ తారీఖున పోపుగారి యభ్యాలర్థులముందటఁ గనబడెను. కజేటన్ లూథరునకు స్నేహితునివలెను, వినయముతో నగుపడి సంఘమునల్ల కల్లోలము చేయుచున్న తన సిద్ధాంతములను మార్చుకొనుమని మాత్రమడిగెదనని యతఁడనెను. లూథరు తన సిద్ధాంతములను బలపర్చసాగెను. అనుకొననిరీతిగా లూథరుతో కజేటను వివాదములో దిగెను. లూథరునకు సరిపోయిన వ్యక్తిని కాదని గుర్తెరిగి వివాదమును మానివేసి మోగాడవలేకుండఁ తనసిద్ధాంతములను మానివేయవలసినదని యతడు కోరెను.

మూఁడుసార్లు లూథరు సభముందు నిలువబడి నిశ్చలుఁడైయుండి "నేను తప్పు చేసితినని నిరూపించు వఱకు నాసిద్ధాంతములను మార్చుకొనను" అనెను. చిట్టచివఱకు కజేటన్ "పొమ్ము, నీవు నీసిద్ధాంతములను మార్చుకొనిన గాని నిన్నుమరలఁ జూడ" ననెను. కజేటన్ స్టాపిట్జుతో "ఆ మృగముతో నాకేమియుఁ బనిలేదు. ఎందుకనఁగా దానికిఁ దీక్ష్ణమైన కండ్లును, వింత యాలోచనలు దాని తలలోఁగలవు" అని నుడివెను.

ఆగ్జుబర్గులో దానేమియుఁ బూర్తిచేయలేదని లూథరు గుర్తెరిగి పోపుగారికి విషయములన్నిటిని సరిగాఁ దెలియ

పఱచుటకై మనవిచేసికొనెను. ఆగ్సుబర్గులో నుండి పోపు గారికి వ్రాసి, అక్టోబరు 20 వ తేదీని దనయింటికి మరలెను. డాక్టరు "స్టాపిట్జు" అతనికి గుఱ్ఱమునిచ్చి, పురపాలక సంఘ మొసగిన సహాయకునితో క్రిస్టాఫరులాంగ్మంటేల్ పట్టణ ప్రాకారములో నుండి పోవుటకు మార్గమును జూపించెను. త్వరగాస్వారిచేసి నలభైమైళ్ళు మొదటి దినము నడిపించు కొని వెళ్లెను. చివరకు నొకసత్రమునొద్ద దిగఁగా నతఁడు నిలఁబడలేకపోయి సత్రములోనున్న గడ్డిలోఁగూలఁ బడెను. అక్టోబరు 31 నాటికి క్షేమముగా విట్టెన్బర్గు పట్టణముచేరి దేవునికి గ్రూరమృగముల కోరలనుండి తప్పించినందుకుఁగృత జ్ఞతాస్తుతులను చెల్లించెను.

## 3 లూథరు, మిల్టిట్జు, తగాదా, బహిష్కారపత్రము.

పోపుగారి యభ్యర్థియగు కజేటన్, తన చేతులలో నుండి లూథరు తప్పించుకొని వెళ్లినాఁడని తెలిసికొని చాలా కోపించెను. అతఁడు ఎలెక్టర్ ఫ్రెడెరిక్ గారికి లూథరును రోమునకుఁ బంపించవలసినది, లేనియెడల బహిష్కరించ వలసినదని వ్రాసి రోమునకుఁ దెలియఁబఱచెను. బహిష్కార పత్రమే సమువమైన రావచ్చునని వారు నిరీక్షించుచుండిరి.

మానవరీత్యా మాట్లాడిన, లూథరు పరిస్థితి మిగుల నిరాశగా నుండెను. ఎలెక్టరుఫ్రెడరిక్ రోమునుండి వచ్చెడి

తాకీదును నిరాకరించిన యెడలఁ దనరాజ్యమునకే భంగము కలుగును. అట్లు జరుగుట లూథరిష్టపడునా? "ఇష్టపడను" అని లూథరు తనమనసులో స్థిరము చేసికొనెను. కజేటన్ వ్రాసిన యుత్తరముయొక్క నకలును లూథరునకుఁ బంపెను. కజేటను నిందించిన వాని కన్నిటికి జవాబిచ్చుచు శాగ్జనిని, వదలి వెళ్ళుట క్లిష్టపడుచున్నాననియుఁ దన రాజ్యమునకు భంగము కలుగుట తనకిష్టము లేదనియు వ్రాతమూలముగాఁ దెలియఁ బఱచెను. ఈ యుత్తరము "ఎలెక్టరు" హృదయమందుఁ జాల పనిచేసెను. అందువలన దానెట్లు ప్రవర్తింప వలెనో నిశ్చయించుకొనెను. అతఁడు వెంటనే కజేటన్‌కు మతభేదాభిప్రాయములు గలవని నిరూపించని వానికెట్టి శిక్షయు విధించ గూఁడదని వ్రాసి, ప్రిన్సు దేశమునకు వెళ్ళనైయున్న లూథరును విట్టెన్‌బర్గులో నుండవలయునని యాజ్ఞాపించెను.

రోమునుండి యింకను బహిష్కార పత్రము రాలేదు. కాని పాపపరిత్యాగ పత్రికలు సరియైనవేయని నిర్ధారణ చేసి, లూథరుయొక్క పేరుకూడ లేకుండ పత్రములను జారీ చేసెను. దలఁచని రీతిగా బదియవలియోపోపు నెమ్మదిగా గార్యసిద్ధి కలుగఁజేయవలయునని తలంచెను. కావున, ఎలెక్టరును మొదట తనవశము చేసికొనవలెనని ప్రయత్నించెను. ఆయనతో సంప్రదించ వలెనని మొదట పోపు తన చాన్సలరయిన చార్లెస్‌వాన్ మిల్‌టిట్జునుబంపెను. అందు

వలన లూథరు నతఁడప్పగించునని నిరీక్షించెను. మిల్ టిట్జు జర్మనీ దేశములోఁ గాలు పెట్టఁగానే లూథరును బట్టి తీసి కొని వెళ్ళుట యసాధ్యమని గ్రహించెను. రోముయొక్క ప్రాబల్యము జర్మనీ దేశమంతట సన్నగిలెననియు నందఱు త్సాహముగా లూథరును గూర్చి మాట్లాడుచున్నారని యతఁడు గ్రహించెను. అవసరమును బట్టి ఎలెక్టరుయెడలఁ జూపించిన శాంతము లూథరునెడలఁ గూడ జూపించవలసి వచ్చెను.

ఆల్టెన్‌బర్గులోని సమావేశమునకు రావలయునని లూథరునకు మిల్టిట్జు కబురంపెను. దానికి లూథరు సమ్మతించెను. జరిగిన సంప్రదింపులలో నతఁడొక రాజకీయవేత్త వలె నగుపడెను. తనవిరోధు లూరకుండిన లూథరు కూడ నిరుత్తరుఁడనై యుందునని యనెను. పోపుగారి శాంతము కనబరచు నొక లేఖయు వ్రాయుదునని వాగ్దానమిడెను. అట్లే మార్చి 3 వ తేదీని నొకయుత్తరము పోపుగారికి వ్రాసెను. గాని తాను గ్రహించిన సత్యమునుండి తొలిగి పోలేదు.

ఇట్టి సమయమున టెజెల్ విషయమై తీర్పుజరిగెను. మిల్ టిట్జు, లిప్జిగ్‌కు వచ్చి తన పనియొక్క వివరమును దెలుప వలసినదిగా టెజెలును సమనుబంపెను. పాప పరిహార పత్రికల వలన గణించిన డబ్బులోఁ గొంతభాగ మపహ

రించఁబడుట వలన లెబ్జిలు సనును ప్రికారము వెళ్ళలేదు. భయాక్రాంతుఁడై యందున జబ్బుపడెను. లూథరు జాలి నొంది ఉత్తరము నతనికి వ్రాసెను. కాని లెబ్జిగు త్వరలోనే చనిపోయెను.

నిశ్శబ్దముగా నుండెదనని లూథరన్నప్పటికి నట్లుతడుం డలేకపోయెను. తన పెదవులతో మాట్లాడ నప్పటికి దన వ్రాతలే మాట్లాడు చుండెను. తన విరోధులు మాట్లాడు చున్నందున నతఁడును మాట్లాడ వలసి వచ్చెను. దిద్దుబాటు నారంభించిన దేవుఁడు చివరవరకు దానిని గొనసాగించెను. లూథరును రంగములోనికి దింపినవాడు 'ఇంగాల్స్టాడ్' యొక్క వేదాంతియగు డాక్టరు 'ఎక్కు'గారు అతడాడంబరము గల వాఁడు-లూథరును గెలువగలవాడు నేను తప్ప మరొకడు లేడని యనుకొనెను. అతనికట్టి సమర్థత లేకపోలేదు. అందువలన మొదట కార్లుస్టాట్ అనునతని నెదిరించెను. కాని నిజముగా నదంతయు లూథరు మీదనే ప్రయోగించెను. అతఁడు కార్లుస్టాటును లీప్జిగ్ సమావేశముకమ్మని కోరెను. అతఁడు వ్రాసినదంతయు లూథరునకు వ్యతిరేకముగా నుండెను. కాఁబట్టి లూథరు దానిని సహించలేకపోయెను. కార్లుస్టాట్ తో 'నెక్కు-గారు' మూఁడుదినములు "స్వేచ్ఛగలమనస్సు"ను గూర్చి తర్కించిన తరువాత లూథరతనితో నైదుదినములు పోపునధికారము, పశ్చాత్తాపము, పర్గేటరి, పాపపరిహార

పత్రికలను గూర్చి పోరాడెను. ఎక్ గారు మంచి యుపన్యాస కుఁడైనప్పటికి దైవగ్రంథమునుండి పైవాటివిషయమై బుజువు పఱచలేకపోయెను. అతని వాగ్ధాటి యెంతమాత్రమును లూథరును గెలువలేకపోయెను. దీని నంతటివిషయమై కోపోద్రేకుఁడై హాస్ యొక్క మత భేదాభిప్రాయమును గూర్చి మాట్లాడి యది లూథరునకు గూడనంటుకొనెనని యనెను. వెంటనే లూథరు హాస్ యొక్క బోధలన్నియు దుర్బోధలు కావని వక్కాణించెను. సాక్సనిదేశపు సామంతుఁడగు జార్జిప్రభువునకు కోపము వచ్చి లూథరును నిందించెను. అప్పటినుండి లూథరున కతఁడు విరోధియైయుండెను.

కోపముతోను కక్షఁ తీర్చుకొను స్వభావముతోను ఎక్కు లీప్జిగ్నుండి వెళ్లి తన విరోధిని నాశన మొనర్చుటకై వేరు ప్రయత్నములు చేయ నిశ్చయించుకొనెను. ఆతఁడు లూథరును వెలివేయు పత్రమును "పోపు"గారినుండి పొందుటకై రోమాపురికిఁ బయనమయ్యెను.

లీప్జిగ్ తర్కము వలన లూథరునకు ప్రాముఖ్యత వచ్చెను. ఆవివాదములో "పోపు"అంత్య క్రీస్తని లూథరు గ్రహించెను. వెంటనే పోపుల పరిపాలనను గూర్చి యనేక పత్రములను ప్రకటించెను. ఒకదాని తరువాత మఱియొకటి యీవిధముగా వ్రాయుటవలన "పోపుల"మతాధికారమునకే భంగముకలుగు నట్లు కనఁబడెను. సత్యదూరులు పంతము కోరికిరి! ఈపరిస్థితు

లలో డాక్టరు "ఎక్కు"గారు రోమునుండి లూథరును క్రైస్తవ సంఘ సహవాసమునుండి దూరపరచుచు, 'ఎవరు వీనిని చేర్చుకొనఁగూడదనియు నితని పుస్తకములను దగులఁబెట్టవలయుననియుఁ దెలియజేయు బహిష్కారపత్రముతో వచ్చెను. అతని పుస్తకములు మేయున్స, కొలోన్, లవేన్‌లో దగులఁబెట్టబడెను.

పోపుగారి యధికార పత్రము శక్తిహీన మయ్యెను. ఏమెరుపు" నెదుట, ప్రపంచమంతయు గడగడ లాడెనోయట్టి మెరుపు, మందుగుండు సామానునుండి మాత్రమే వచ్చినదని గ్రహించిరి. బహిష్కార పత్రమునకు రెండు పత్రికలద్వారా జవాబిచ్చెను. అవేవనఁగా 1. ఎక్కుగారి బహిష్కారపత్రిము దానియందుగల యసత్యములు 2. అంత్య క్రీస్తుయొక్క బహిష్కారపత్రిము. ఎందుకనఁగా అవి క్రీస్తునే ఖండించెనని లూథరభిప్రాయపడెను. స్వతంత్ర క్రైస్తవుఁడు పోపుగారి శాపమునుగూర్చి భయపడనవసరము లేదని తన శత్రువులందఱు తెలుసికొనులాగున 10 డిసెంబరు 1520 సం॥న గొప్ప సమూహము నెదుట విట్టెన్‌బర్గుపట్టణ ఎల్‌స్టర్ గేటు ముందుపోపుగారి బహిష్కారపత్రమును గాల్చివేసెను. "నీవు సర్వోన్నతుఁడైన దేవుని బాధించినందున నిత్యనరకాగ్ని నిన్ను గాల్చివేసి మ్రింగివేయునుగాక" అని లూథరు దానినిగాల్చి వేయుచుబలికెను. దానిని కాల్చినందుకుఁ గారణము తెల్పుచుఁ

గరపత్రిము నొకటి ప్రకటించెను. రోము, లూథరు వేరైరి. రోము లూథరును బహిష్కరించెను. తత్సమయమున నియ్య వలసిన సందేశము లూథరునకు లేకపోలేదు.

4 వరమ్సు పట్టణసభ యెదుట లూథరుండుట.

మాక్సిమిలియన్ చక్రవర్తి 1519 సం॥లో చనిపో యిన తరువాత అక్టోబరు 23, 1520 వ సం॥న అతని సోదరుని కుమారుండైన స్పెయిన్ దేశపు "చార్లెస్" అనునతనిని ఐదవ చార్లెస్ అను నామముతో జక్రవర్తిగాఁ బట్టాభిషేకముచేయ బడెను. ఈనూతన చక్రవర్తికి, లూథరును అతనిదుర్బోధలను నాశన మొనర్చవలసినదిగా బలుకుబడిగల రోమీయుల ద్వారా సందేశమంపిరి. ఎట్టిచర్యలు లూథరుమీఁదఁ దీసి కొనకముందు, నతని సిద్ధాంతములు తప్పుడుబోధలని నిరూ పణకావలసియున్నదని ఎలెక్టార్ ఫ్రెడెరిక్ పట్టుదలతో నుండెను.

ఎలెక్టారుగారి మాటకు జక్రవర్తియొద్దఁజాల విలువ యుండెను. అందువలన వరమ్సుసభయెదుటకు "తగాదా"ను దీర్చుటకై లూథరును దీసికొని రావలసినదని "ఎలక్టార్"నకుఁ జక్రవర్తియనుజ్ఞయాయెను. బహిష్కరింపబడిన వానితో నెట్టి సాంగత్యముండరాదని పోపుగారి యభ్యర్థియగు 'అలియాండ రిట్టిపన్నాగము నెడిరించెను. మఱియు "పోపు"గారినుండి మఱియొక్క బహిష్కారపత్రమును దీసికొనివచ్చెను, దీనిలో

లూథరును మాత్రముగాక, యతని యనుచరుల సంపదలని బహిష్కరించినట్లుండెను.

జబ్బుపడి మంచముమీద మోసికొని వెళ్ళవలసియున్న ప్పటికి డియెట్ సభయెదుట నిలువఁబడెదనని లూథరు తన సమ్మతిని దెలియబఱచెను. తగినకాలములోఁ జక్రవర్తి నుండి సమను, రాజదళము వచ్చెను. ఈసమనులో "పోపు" గారివలన రెండుసార్లు బహిష్కరింపబడిన వానికి "గౌరవ నీయులును, ప్రియులైన డాక్టరు మార్టిన్ లూథరు భక్తునికి" అని చక్రవర్తిగారు వ్రాసిరి. మానవరీత్యా తలంచిన నీసమ న్ననకు లోఁబడుట చిన్నవిషయముకాదు. ఎందుకనఁగా సువార్తకు శత్రువులుగా నున్నవారు లూథరును జంపనుద్దే శించిరి. రాజకీయదళము లూథరును రక్షించక పోవచ్చుననెడి సత్యము జాన్ హెస్‌కు, రాజదళమున్నప్పటికి జరిగిన మరణ మువలన విదితమే. అట్టికారణమున లూథరుయొక్క స్నేహి తులతనిని వెళ్లవద్దని సలహా నిచ్చిరి. అవసరమైన హతసాక్షి గానుండఁ దలంచి లూథరు "హస్ బూడిదచేయ బడినప్పటికి, సత్యము బయలుపడియే యున్నది. "వరమ్సు" విట్టెంబర్గుపట్ట ణముల మధ్య నాకాశమునంటునట్టి మంటలు చెలరేగినను, సమ్మనున్సుచేయఁబడినాను, కాబట్టి, దేవునిపేర బెహీమత్ నోటిలోఁబడి క్రీస్తును ప్రకటించవెళ్ళెదను. ఆయనకిష్టము వచ్చినట్లు చేయవచ్చును." అని నుడివెను.

ఏప్రిల్ 2, 1521 తేదీన కాస్పర్ స్టరమ్ అనురాజుగారి నుండి వచ్చిన వానితోను, గొందఱు స్నేహితులతోను, బయలుదేరి వెళ్ళెను. ప్రతిచోట లూథరు "ఆశ్చర్యమును" "ఆనందమును, నెలకొల్పెన. దారిలో "పోపునకుగాని చక్రవర్తికిగాని భయపడనటువంటి సన్యాసిని జూడఁ ప్రజలుం గుంపులుగుంపులుగా వచ్చిరి. మార్గములో (ఫ్రాంజ్ వాన్) సికించెన్ అనుసామంతులు ఎబర్న్ బర్గులో జక్రవర్తిగారి దత్తత తండ్రితో మాట్లాడలూథరుకుఁ గబురంపెను. ఎందుకనగాఁ వరమ్సుపట్టణమున లూథరు సురక్షితమునందజాలఁడనియు నందువలన ఎబర్న్ బర్గులో నుండుట క్షేమమని యతనికిఁ దెలియవచ్చెను- కాని లూథరు "చక్రవర్తిగారి దత్తత తండ్రి నాతో మాట్లాడఁ గోరిన యెడల వరమ్సుపట్టణములోనే మాట్లాడవచ్చునని" కబురంపెను. వరమ్సుపట్టణసరిహద్దులలోనున్న, తనస్నేహితుఁడైన, స్పాలాటిన్ వరమ్సుపట్టణములో క్షేమములేదని మఱియొక హెచ్చరికను లూథరునకంపెను. కాని లూథరు "వరమ్సు పట్టణములోని యిండ్లమీఁదనెన్ని పెంకులున్నవో యన్నిదయ్యములా పట్టణములోనున్నప్పటికి నేను వరమ్సుపట్టణమునకు వెళ్ళి తీరెదను" అనియనెను.

ఏప్రిల్ 16 వ తేదీన లూథరు చిన్నబండిలో వరమ్సుపట్టణములోఁ ప్రవేశించెను. గొప్పజనసమూహము లాతని

జూడ వేంచేసెను. బజారులన్నియు గ్రిక్కిరిసి యుండెను. కాబట్టి ఇండ్లకప్పుల నెక్కి లూథరును జూడసాగిరి. రెండు వేలమందికన్న నెక్కువమంది తనబసకడకేగిరి

సామంతులు, జమీందారులు, యుద్ధశూరులు, ప్రభువులు లూథరును రక్షించెదమని ముందంజ వేసిరి. లూథరు తన్నెవ రేర్పాటు చేసికొనిరో యట్టిదేవుని మీదనే యాధారపడెను; కాని మానవశక్తిమీద నాధారపడలేదు. తన ప్రభుడగు యేసుక్రీస్తును గూర్చి ప్రకటించ శ్రద్ధగలిగినట్టియు, మనఃపూర్వకమైన ప్రార్థనను సిద్ధము చేసుకొనెను. ప్రార్థనలో దేవునితోఁ బోరాడి, యీవిషయమును దేవుని కప్పగించెను. నొక ఈ దిగువ నుదహరింపబడినది యాయనచేసిన ప్రార్థనలలో భాగము.

"సర్వశక్తిగల నిత్యుడవైన దేవా! ప్రపంచజ్ఞానము, తెలివిని మించి నాకండగా నుండుము. ఆలాగున చేయుదురు. చేయవలెను; మీరే చేయఁగలరు. ఈ హేతువు నాది కాదు- మీదే. లౌకికులతో నాకెట్టిసంధము లేదు. సత్యమైనట్టియు, శాశ్వతమైనట్టి యీసమస్య మీదై యున్నది. నమ్మదగినట్టియు, నిత్యుడవైన దేవా! నావైపునిలఁబడుము. మానవులమీద నాధారపడను. వారు నాకు సహాయము చేయలేరు. నీవే నన్నీపనికి నేర్పాటు చేసినావు- కాఁబట్టి దానిని నీవే కొనసాగించుము. నారక్షణ, నాకీడుము, నాదుర్గమగు నీకుమారు

డైన శ్రీయేసుక్రీస్తు పేరట పరిశుద్ధాత్మశక్తి చేత నన్నురక్షింపుము. నాకు నీవొసర్చిన పని నిమిత్తమై గొఱ్ఱెపిల్లవలె నాప్రాణ ణమర్పింప సంసిద్ధముగా నున్నాను. ఎందుకనగా నీపనిపవిత్ర మైనది. నేను నీసన్నిధినుండి నిత్యము తొలిగిపోను. నాశరీరము నాశమొందినను నాయాత్మనీదే. నాయాత్మ నీకే చెల్లును. మఱియు నదినిత్యము నీతోనే యుండునుగాక!

వరమ్సు పట్టణములోఁ బ్రవేశ పెట్టిన దినమున 4 గం టలకు సేనాధిపతి లూథరును సంఘసమావేశము నెదుటకుఁ దీసికొని వెళ్లెను. తోటల వెంటా, సందులగుండా తప్పించు కొని వెళ్లవలసినంతగా జనులు వీధులనిండ క్రిక్కిరిసియుండిరి. సభ కూర్చుండిన హాలుయొక్క గుమ్మము నెదుట నొక యనుభవశాలియగు యుద్ధశూరుడు 'జియోవాన్ ఫ్రండ్సుబర్గు' అనునాతఁడు లూథరునుజూచి, భుజముమీద చేయివేసి, తట్టి యావనసన్యాసీ! నేనుగాని మఱియే యితర సేనాధిపతి పోరాడనటువంటి యుద్ధము నీవుచేయఁబోవుచున్నావు. నీవు దేవుని పేర నీసమరమును సలుపుచున్నావు కాఁబట్టి- సంతోషముగా నుండుము. దేవుడు నిన్ను విడువఁడు "అని యనెను.

లూథరు సంఘసభయెదుట నిలువఁబడెను. సూర్యు డస్తమించని సామ్రాజ్యముగల చక్రవర్తి, సింహాసనాశీను డయ్యెను. ఆయన ప్రక్కన యతని సోదరుఁడగు ఫెర్డినాండు

కూర్చుండెను. మఱియు నారుగురు సామంతులు. నిరువది నలుగురు రాజులు, సేనమంత్రులు జమీందారులు, ముప్పదిమంది బిషప్పులు, పాదిరీలు మఱియు నువరాజులు, ప్రభువులు, డాక్టర్లు మొదలగువారుకూడ ప్రక్కనే కూర్చుండిరి. సత్యమునకు దూరస్థులైన, సత్రువులలో కూడిన మహాసభయెదుట నాపేదసన్యాసి సువార్తను వెల్లడిచేయవలసి వచ్చెను.

ట్రెంటు దేశపు "ఆర్చిబిషపు"గారి చాన్సలరగు జాన్ఎక్ (ఇదివరలో చెప్పఁబడిన జాన్ఎక్ కాదు)- బల్లమీద నున్న పుస్తకములన్నియు నతఁడే వ్రాసెనా యనియు నవి బోధించుచున్నవనియు తీసివేసికొంటున్నారాయని యడిగెను. జెరోమిష్కరఫ్ లూథరునకు సలహాదారునిగా నియామకమయ్యెను. నీ గ్రంథముల పేర్లను జెప్పవలసినదిగాఁ గోరెను. లూథరు చదివి యవి తనవేయని "ఒప్పందము" చేసెను. అభిప్రాయములను మార్చుకొనుటఁకు గొంతవ్యవధి కావలయు నని కోరెను. ఎందుకనఁగా నీసమస్య విశ్వాసము, రక్షణ, దేవుని వాక్యములను గూర్చియై యున్నదనియు, నాలోచన లేకుండ నేమిచేయుటకు వీలులేదని తెలియజెప్పెను. ఆలోచించుట కిదివరకున్న సమయమే మంచిదనిరి. తన మనవి నోటిమాటలతోఁ దెలియ పఱచినఁ జాలు. వ్రాతపూర్వకముగాఁ దెలుపనవసరము లేదని తెల్పిరి.

బసచేరిన తరువాత, లూథరు తన బోధలన్నియు దేవుని వాక్యమును బట్టి పరీక్షచేసి ప్రార్థన వలన బలపరచం బడెను. మరుసటి దినము ఏప్రియల్ 18 వ తేదీన సాయింత్రము 4 గంటలకు సభయెదుట నిలువంబడుటకు సిద్ధముగా నుండెను. కాని 6 గంటల వఱకుం బిలువబడలేదు. మర్యాదతోను, బట్టుదలతోను ల్యాటిన్, జర్మనీ భాషలలో సువార్తను గూర్చి యనేకమంది యెదుట ధైర్యముగా సాక్ష్యమిచ్చెను. తనవ్రాతలను గూర్చి యవిమూండు రకములని తెలియఁపఱచెను. మొదటిరకము విరోధులుసహా సత్యములని చెప్పిన విషయములనుగూర్చి వ్రాసెను. వీనిని సత్యమును మార్చకుండ మార్చివేయలేనని యనెను. రెండవ తరగతి వ్రాతలలో "పోపుల" పరిపాలనను గూర్చియు, వారిసిద్ధాంతములను గూర్చియు ఖండించి వ్రాసెను. పోపుల దాష్ట్యమును బలపర్చకుండాను- కిటికి, ద్వారము, గేటులను అద్వైతమునకుం దెరువకుండా దన రెండవ రకపు వ్రాతలను మార్చుకొనలేనని తెలిపెను. మూండవ తరగతిలో 'పోపుల" దాష్ట్యమును బలపఱచి దైవసిద్ధాంతములను మార్చినకొందఱి వ్యక్తులను ఖండించెను. ఈ వ్రాతలలో దాను పరిశుద్ధుండు కానందుకుం గొంతవఱకు కఠినముగానే ఖండించెను. అద్వైతమునకుం దావియ్యకుండాం దన వ్రాతలను మార్చలేనని వక్కాణించెను. చివరకు దైవగ్రంధమునకుం దనవ్రాత

లన్నియు వ్యతిరేకములని నిరూపించఁ గలిగిన యెడల వాటినిఁ దగులబెట్టుటకుఁదాను మొదటి వాఁడని తెలిపెను.

లూథరుయొక్క యీజవాబు పోపుల సంబంధులకు సరిగాలేదు. ఎక్ చాన్సలర్ గారు లూథరు సూటిగా జవా బియ్యలేదనియు,ఁ దాను దన వ్రాతలను మార్చుకొనునా లేదా యని, సరియైన తిన్నని జవాబియ్యవలెనని కోరెను. లూథరు "చక్రవర్తియు, సామంతులు, ప్రభులందఱు సరి యైన క్లుప్తమైన జవాబియ్యవలెనని కోరుచున్నారు"- కాఁబట్టి కొమ్ములు, పండ్లు లేనటువంటి జవాబిచ్చెను. ఆదేదనగా! దైవగ్రంథమునుండి లేక జ్ఞానయుక్తముగా లేనియెడల నేను నా వ్రాతలను మార్చజాలను. పోపులను, సంఘసభికులును బొరపాటులోఁబడిరి. మఱియు నొకరు చెప్పినదానికి మఱి యొకరు చెప్పినదానికి సంబంధములేకుండఁగూడ నుండెను. కాఁబట్టి దైవగ్రంధమునుండి చూపించిన వాక్యములను, నామనస్సాక్షికి వ్యతిరేకముగాఁ నుండినయెడల నేనువాటిని మార్చఁజాలను. మనస్సాక్షికి వ్యతిరేకముగా ప్రవర్తించుట క్షేమముగాదు- న్యాయముకాదు. ఇంతకుమించహా నేనేమియుఁ జెప్పజాలను. మీయెదుట నేను నిలువబడి యున్నాను- మీ కేమైన జేయవచ్చును దేవుఁడు నాకు సహాయముజేయునుగాక! ఆమెన్" అని యూరకుండెను.

సూటిగాఁ జెప్పబడిన లూథరుయొక్క జవాబు సభ

వారిలో గొప్పభావము కలుగఁ జేసెను. మొదట భయాన మును, తరువాత నుద్రేకమును గలుగఁ జేసెను. లూథరును దీసికొని వెళ్ళినతరువాత సభముగిసెను. ఆ సాయింత్రమే బ్రన్సు విక్కు యొక్క ఎర్నెస్టు ప్రభువు విశ్వాసమును ధైర్య ముతో నొప్పుకొనినందున నొక వెండిపాత్రలో "బీరు" అను సారాయిని లూథరున కంపెను. దానిని లూథరు త్రాగుచు "ఎర్నెస్టు ప్రభువు నన్నీదినమున జ్ఞాపకము చేసుకొనినట్లు దేవుఁడాయన చివరిగడియలలోను జ్ఞాపకముంచుకొనునుగాక!" అని యనెను.

ఎలెక్టారు ఫ్రెడెరిక్కు లూథరుయొక్క ధైర్యముగల యొప్పుకోలునుబట్టి యధికముగా సంతోషించెను. ఆయన స్పెలాటిన్‌తో నీవిధముగా ననెను. "ఫాదరు మార్టిన్ చక్రవర్తి తదితరసామంతుల యెదుట బాగుగా మాట్లా డెను. చూపించ వలసిన ధైర్యముకన్న నధికముగానే కనఁ బరచెను."

లూథరు కనబరచిన మొదటిభావోద్రేకము చల్లారిన తరువాత, మరల నతని మీఁదికి దండెత్తిరి. మతభేదాభిప్రాయ ముగల వాని విశ్వాసమును గమనించవలసిన యగత్యము లేదనియు, చక్రవర్తి యాతని క్షేమమునుగూర్చి చేసిన రక్ష ణదళపు టేర్పాటు లేమియుఁ జేయనవసరములేదను నభి ప్రాయమును గనబరచిరి. అట్టి చర్యనుగూర్చి జర్మనీదేశపు

సామంతులందఱు తమయసమ్మతిని దెలియఁబరచిరి. లూథరు నకు గర్భశత్రువగు శాగ్జనీదేశపు జార్జిపరిభుఫు కూడఁ దన యసమ్మతిని దెలిపెను.

జాన్ హాస్ విషయములో సిగిస్ మండ్ చక్రవర్తియొక్క ప్రవర్తనద్వారా తనసామ్రాజ్యమంతటికి యవమానము కలిగినందున నట్టియవమానము తన సామ్రాజ్యమున కంట కుండవలెనని చార్లెస్ చక్రవర్తి తలంచెను.

చక్రవర్తిగారి రక్షకభటులతో నిరువది జనములలో విట్టెనుబర్గు పట్టణమునకుఁ జేరవలసినదని యాజ్ఞయాయెను. లూథరు "దైవచిత్తాను సారముగా, నిదిజరిగెను. దైవనామ సంస్తుతి కలుగుగాక!" అనియెను.

ఏప్రియల్ 26 వ తేదీని రక్షకభటులతోను, గొందఱి స్నేహితులతోను, కాస్పరుస్టరమ్, అనుసేనాధిపతితో వరమ్సు పట్టణము వదలి వెళ్ళెను.



# చతుర్థభాగము

## దిద్దుబాటు యొక్క వృద్ధి వ్యాప్తి.

### 1 లూథరు వార్టుబర్గులో నుండుట.

వరమ్సపట్టణమునుండి లూథరు సంతోషముగా వచ్చెను. అనేకుల యెదుటఁ దనవిశ్వాసమును గట్టిగా వెల్లడి చేసెను. దానిపర్యవసానము భగవంతునికే వదలెను. ఫ్రీడ్ బర్గులోఁ దనతో వచ్చిన దూతను బంపివేసెను. ఎయిస్ నాక్ వద్దతనతో వచ్చిన స్నేహితులలోఁ జాలమందిని బంపివేసెను. బంధువులలో గొందఱిని దర్శించుటకై మోహారాయనుగ్రామమున కేగెను. ఇక్కడనుండి మరల విట్టెనుబర్గునకు బ్రయాణమయ్యెను. ఆల్టెన్ స్టీన్ అనుకోటదగ్గర గుఱ్ఱపురౌతులతనిఁ గలిసికొని, గుఱ్ఱముమీద నెక్కించి, యడవిలో గొంతసేపు ప్రయాణముచేసి వార్టుబర్గుకోటకుఁ దీసికొని వచ్చిరి. ఇక్కడ శూరుఁడైన 'జార్జి' అను నామమునఁ గొంతకాలముండెను. సన్యాసుల దుస్తులను దీసివేసి, గడ్డముపెంచి, శూరుని వస్త్రములను ధరించుకొనెను. తనకురానైయున్న యిక్కట్టులన్నింటి నుండి తప్పించుకొనుటకై లూథరు తన స్నేహితులచేతులలో ఖయిదీగానుండెను. మేనెల 4, 8 తారీఖులలో లూథరును బహిష్కరించుచు, "ఎవరైన నతనికి శరణుగాని, భోజనపానాదులుగాని యిచ్చిన" వారిని బహిష్కరించు, ప్రకటనలనుండి

వార్టుబర్గు యొక్క గోడలు లూథరును కప్పివేసెను. పోపుల సైన్యమంతయు వృథాప్రయాసపడెను. లూథరు సత్యమును గూర్చి గొప్పసాక్ష్యమిచ్చి తనశత్రువులనుండి దైవికముగా రక్షింపబడెను.

వార్టుబర్గులోఁ గడిపిన కాలమంతటిని లూథరు సద్విని యోగపర్చెను. పోపులలోగాని సంఘసభలలోగాని, తనకు విశ్వాసములేదనియు, దైవగ్రంథమే మనకాధారమనియు వెల్లడిచేసెను. కాఁబట్టి, దైవగ్రంథము మఱియుముఖ్యముగా నూతన నిబంధన, ప్రతివానిచేతిలోఁ దనస్వభాషలోనుండిన యెడల ప్రతివాఁడు లూథరుబోధించిన వన్నియు నిజమో కాదోతామే తెలిసికొనుట యగత్యమని యెంచెను. కావున నూతన నిబంధనను జర్మనీభాషలోనికి 'తర్జుమా' చేయ మొదలుపెట్టెను. సంఘవ్యాఖ్యానములు, ఇతర మంచిగ్రంథములు వ్రాసెను. విశ్రాంతినిమిత్తము కోటచుట్టునున్న యడవిలో షికారుచేసెను. కొన్నిసార్లు వేటనిమిత్తమై యితరులతోఁ గలసిపోయెను. వీనినిగూర్చి స్పాలాటిన్‌తో "వేటభావన మేమనఁగా దేవుఁడులేని యజమానులు, యజమానిలేని కుక్కలురీతిగా బిషప్పులకు వేదాంతులద్వారా సైతాను నిర్దోషులైనవారిని వేటాడుచుండెను. విశ్వాసులనుగూర్చి నాకుఁ గడుజాలి కలుగుచున్నదని" చెప్పెను. కొన్నిసార్లు చేతిలోఁ గరవాలమును, వెంటసైనికునితోను, బహుదూరము

ప్రయాణముచేయువాఁడు. ఒకసారిట్టిప్రయాణములో విట్టెన్ బర్గులోనున్న స్నేహితులను గూడ దర్శించెను.

హార్డుబర్గులో నతని స్వల్పకాలనివాసమతని పోరాటమునుండి విరమించెనని యర్థముకాదు. మేయన్సుపట్టణపు 'అర్చిబిషప్పు' లూథరునకగుపడకుండ చేయఁగలిగినామని తలంచి మరల పాపపరిహారపత్రికలనమ్మనుద్దేశించెను. హాలీపట్టణములోనవి యమ్మబడునని ప్రకటించెను. ఆవిషయము లూథరు తెలిసికొని 'అర్చిబిషప్‌నకు' లూథరు పరలోకగతుఁడైయున్నాడని తలంచనవసరము లేదనియు దానికార్యమునందు దీక్షకలిగియున్నయెడలఁ బదునాలుగు దినములలో దానిని బయలు పరచెదననియు వ్రాసినలేఖలోఁ దెలిపెను. ఆర్చిబిషప్పు వినయముతోఁ దనపాపము నొప్పుకొని, పాపపరిహార పత్రికలనాపుదలఁ జేసియున్నానని లూథరునకు మర్యాదగా జవాబిచ్చెను.

వార్డుబర్గులోనుండఁగా దనకాలమంతయు సద్వినియోగపర్చుట లేదని లూథరు తలంచి తిరిగి విట్టెన్‌బర్గు పట్టణమునకు వెళ్లితనకర్తవ్యము నెరవేర్చవలెనని యోచించెను.

## 2. లూథరుయొక్క జతపనివారు, విట్టెనుబర్గు యొక్క చపల చిత్తులు, కర్షకుల యుద్ధము.

దిద్దుబాటు పనిలో విద్యావంతులు, భక్తిగల యనేకులు

లూథరుయొక్క జతపనివారుగా నుండిరి. వారిలో ఫిలిప్ మెలాంక్తన్ ప్రాముఖ్యుఁడు. అతఁడు ఫిబ్రవరి 16, 1497 లో 'పలాటినేట్' అనుపరగణాలోఁబ్రెట్టనను గ్రామమున జన్మించెను. యుద్ధసామగ్రిచేయువాని కుమారుఁడు. పదునారు సంవత్సరములకే ఎం. ఎ. పరీక్షను గెలిచెను. ఇరువదియొకటవ సంవత్సరమున విట్టెన్‌బర్గుపట్టణములోఁ బండితుఁడుగా 1518 లో నేర్పాటాయెను. తన విద్యాజ్ఞానము వలననతనికి "జర్మనీ దేశపుగురువు" అని బిరుదుకలిగెను. లూథరువంటి గొప్ప ధైర్యశాలికాకపోయినను దిద్దుబాటుపనిలో నతని సహాయమవసరమని లూథరు గమనించెను. ఏప్రిల్ 19,1560 స॥వ విట్టెన్‌బర్గుపట్టణములో నతఁడు చనిపోయెను.

డాక్టరు జాన్ బ్యాజెన్ హేజెనను నతఁడు 1485 లో 'పొమెరేని'యాలో జన్మించెను. అతఁడుసన్యాసిగానుండెను. గాని లూథరు వ్రాసిన సంఘముయొక్క "బబులోనుచెర" అనుగ్రంథమును జదివి సత్యమును గ్రహించెను. తన స్వగ్రామము నామమునుబట్టి లూథరతనిని, డాక్టరుపామరని పిలిచెడివాఁడు. సంఘమును, విద్యాసంస్థలను జక్కబెట్టగల వరములనేకములతని కుండెను. తన స్వస్థలములో హింసింపఁబడి, 1521 లో విట్టెన్‌బర్గుచేరి, 1522 లో వేదాంతపండితుఁడై పట్టణసంఘ గురువుగా బనిచేసెను. అతఁడు హాంబర్గు, ల్యూబెక్, బ్రెమెన్, స్లెస్విగ్ హాల్‌స్టీన్, డెన్మార్కు,

పొమిరేనియా, బ్రిన్స్విక్ స్థలములలో బనిచేసి, సువిశేష సంఘూరాధనలనే, యవలంబించి 1558 లో బరలోకగతుడయ్యెను. డాక్టర్ జస్టస్ జోనాసను నతడు జూన్ 5, 1493 లో నార్డుహాసన్‌లో జన్మించెను. లూథరుయొక్క శ్రద్ధ నమ్మకముగల స్నేహితులు జతపనివారలలో నొకడు. అతడు ఎర్ఫర్డులో న్యాయచట్టమును జదివి తరువాత వేదాంతమునుగూడ జదివెను. 1521 లో విట్టెన్ బర్గులో బండితుడుగా నేర్పాటు చేయబడెను. 1541 లో హాలీ పట్టణమునకు బిలువబడెను. ప్రతి ప్రాముఖ్యమైన సమయమప్పుడు లూథరు చనిపోయినప్పు డితడు హాజరయ్యెను.

ఈ ముగ్గురు మాత్రమేగాక విట్టెన్‌బర్గులో, నితర స్థలములలో లూథరుయొక్క జతపని వారనేకులుండిరి.

దేవుడు నమ్మకమైన సహాయకులను లూథరున కిచ్చినను, దురాత్మ అపనమ్మకపు వారినిలేపెను. పోపుల మతాధికారము నుండి విడుదల నొందగోరిన వారనేకులు. కాని, వారు దేవుని పరిశుద్ధ వాక్యమునకు లోబడనిష్టపడకైరి. అనేక విధములుగా వారు దిద్దుబాటు పనికి నాటంకములు కలుగజేసిరి.

లూథరు దేవునివాక్యముయొక్క శక్తిని దనహృదయమందనుభవించెను. మానవకల్పితములనుండి విడుదలనొంది, ఒక్కడే మధ్యవర్తియైన, క్రీస్తునందుగల విశ్వాసముద్వారా

మానవ కల్పితములమీద నాధారపడిన దూషణల నెల్ల నెదుర్కొనఁ గలిగెను. ఈసువిశేష మార్గమువలన బోపులయధికారమునుండి యందఱిని విడుదలజేయ లూథరు సమకట్టెను. లోనుండిదిద్దుబాటు చేయవలెనని యుద్దేశించెను. కాని యతఁడు బ్రిటెన్‌బర్గులో, లేని సమయములోఁ బరిశుద్ధాత్ముని మార్గముల సరియైనరీతిగా గ్రహించని వారనేకులు, బయలుదేరిరి. వారికి దిద్దుబాటు త్వరగా జరుగలేదు. దానిని త్వరగా నెరవేర్చవలెననెడి భావముతోననేక తప్పులోవలఁద్రొక్కి తత్తరపాటునుగలుగ జేసిరి. హద్దు, అపు లేనిమూకలు బ్రిటెన్‌బర్గ దేవాలయములో బ్రవేశించి, శిలువలను, బొమ్మలను, విరుగగొట్టి పాడు చేసిరి. దానిలోఁగల శృంగారవస్తువులను, పరిశుద్ధ పాత్రలను బైటపారవేసి, యక్రమ దుస్థితినిగలుగఁ జేసిరి. డాక్టరు కార్లు స్టాట్ వారిలో నొకడై యుండెను.

మెలాంక్తన్, తదితరులు నట్టియల్లరినాప శక్తిహీనులై యుండిరి. జిక్కావను చోటనుండి కొందఱు ప్రవక్తలమని చెప్పుకొనుచు దైవదర్శనములుకలిగినవనియు, నట్టిదర్శనములు వేదవాక్యముకన్నఁ బ్రాముఖ్యమనియుఁ జెప్పుచుఁ గొందఱు బయలుదేరిరి. చిన్నబిడ్డల బాప్తిస్మమును ఖండించిరి.

ఈవిషయములన్నియు లూథరు గమనించినప్పుడేమాత్ర మును వార్టుబర్గునందుండలేక, 'ఎల్లవారుగారిష్టపడ నప్పటికి

విట్టెన్‌బర్గునకు మార్చి 17వ తేదీ వరుదెంచెను. దారిలో నుండగనే, మనస్సాక్షినిబట్టి దైవచిత్తానుసారముగా దాను బయలుదేరి వచ్చుచున్నానని యొకసందేశమంపెను. జార్జి ప్రభువు యొక్క శత్రుత్వమునుగూర్చి లూథరు "విట్టెన్ బర్గులోనున్న పరిస్థితులు లీప్‌జిగ్‌లోగూడనున్న యెడల బ్రతిదినమిప్పుడున్న జార్జిప్రభువువంటి జార్జిప్రభువులను వర్షము కురిపించినట్లు తొమ్మిదిదినములవరకు బ్రతిదినము, మరుసటి దినమునకు దొమ్మిదిరెట్లు కురిపింపఁ బడినప్పటికి నేనక్కడికి వెళ్ళెదను" అని యనెను

విట్టెను బర్గువచ్చినతోడనే దేవుని వాక్యముతో 'పోపుల' నందరిని ఖండించెను. ఆవాక్యముతోఁ జపలచిత్తుల నందఱిని ఖండించెను. అప్పుడున్న యక్రమ మంతటినిగూర్చి యెనిమిది దినములు వరుసగా బోధించెను. అందువలన నాందోళన వృద్ధియై, ప్రజలు, నాయకులుకూడ జ్ఞానమునకును, దేవుని వాక్యమునకును జోటిచ్చిరి. కాని కొందరు నాయకు లాస్థలమును వదలి, వేరుచోటునకు వెళ్ళి, తొందర కలుగజేసిరి.

జికాల్‌నుండి ప్రవక్తలనఁబడినవారు కర్షకుల నుద్రేకపరచి క్రైస్తవస్వాతంత్ర్యమనఁగా గవర్నమెంటుండఁ గూడదనియుఁ పరిపాలకులని, ప్రజలని వివక్షత యుండరాదనియు, యజమానుఁడు సేవకుఁడు మొదలగు భేదములుండరాదనియు బోధించెను. ఇష్టముగా, వినెడివారనేకులను గనుగొనిరి.

స్వాబియానుండి తురింగియా వఱకు దడవిలోఁ బడిన చిచ్చువలెఁ ద్వరలోనే కర్షకుల తిరుగుబాటు బయలుదేరెను. కోటలును, మఠములును నాశనముచేయఁబడి యనేక విధములగు నేరములు చేయబడెను. వారెక్కడికి వెళ్ళిన నక్కడ పొగలు రేపుచు బరివర్తించిరి.

కర్షకుల నణచుటలో, బరిభువుల నందఱిని మందలించెను - కాని వారతనిమాట వినకుండుట ఫలితము త్వరలోనే కనబడెను. ప్రభువులు, కర్షకులు, త్వరలో సమాధానమునకు రావలయునని యిరుపార్శ్వముల వారికి బోధించి దేవుని వాక్యముద్వారా మందలించెను. ఇతఁడు వ్రాతమూలముగాను, తురింగియా పరగణావఱకుఁ బ్రయాణముచేసియు బోధించెను. కాని వారాతని మాటలను చెవినిబెట్టలేదు. కర్షకుల తిరుగుబాటు నధికారబలముతో నణచివేయవలయునని ప్రభువులను లూథరు కోరియుండెను.

తురింగియాలో "తామస్ మూంజర్" కర్షకులసైన్యమును నడిపించెను. అతఁడు ప్రవక్తనని చెప్పుకొని, శత్రువుల తుపాకి గుండ్లను తనచొక్కాతో నాపుచేయఁగలనని కర్షకులతోఁ జెప్పెను. మే నెల 15, 1525 న నతఁడున్న, అతని యెనిమిదివేల సైన్యము ప్రభువుల వలన ఫ్రాంక్ హాసెన్ అను చోట నోడింపబడిరి. మూంజర్ పట్టణములోనికిఁ బారిపోయి దాగుకొనెను. కాని కనుగొనబడి, పట్టుబడి, తలనరికివేయ

బడెను. కొలది కాలములోనే తిరుగుబాటు మాన్పివేయఁబడెను. కాని రక్తప్రవాహము జరుగక యుండలేదు.

ఇట్టిచర్యలన్నియు సువార్తవ్యాప్తికై యాటంకములుగానుండెను. ఎందుకనఁగా దుష్టులు "ఇదంతయు లూథరు వలననే జరిగెను. అని తలంచిరి. అయినప్పటికి దిద్దుబాటు సాగిపోవుచునేయుండెను. ఎందుకనఁగా నది దైవచిత్తమై యుండెను.

ఐదవ చార్లెసు చక్రవర్తి వారమ్సు పట్టణసమావేశము నుండి స్పెయిన్‌కు వెళ్ళినతరువాత నెనిమిది సంవత్సరముల వరకు మరల జర్మనీదేశమునకుఁ దిరిగిరాలేదు. ఈలోఁగా దిద్దుబాటుమాత్రమును దేశచట్టములనుబట్టి యాటంకపరచఁ బడలేదు.

## 3 పరస్పర విరుద్ధభావములలో సమాధానపద్ధతుల ప్రవేశపెట్టుట.

లూథరుయొక్క సిద్ధాంతముల నవలంబించినవారిలో ననేకులు వారివిశ్వాసమును రక్తముతో ముద్రవేయవలసి వచ్చెను. పోపులు యధికారము క్రిందనొకరి, తరువాత నొకరు హతసాక్షులగుటఁజూచి లూథరు "నేనేమాత్రము! నేనేమి చేయుచున్నాను? నేనిదివరకే హతసాక్షినైయుండనందుకు సిగ్గుపడుచున్నాను. అలాగుజరుగవలసియున్నచో నదేజరుగును

గాక! దేవా! నీచిత్తమే సిద్ధించునుగాక! అని యనెను. పోపుల నరహంతకులచేతులలో, లూథరు పడుట దేవుని చిత్తమై యుండలేదు. దేవుఁడతని నాశ్చర్యముగా రక్షించెను. శత్రువులడ్డగించినప్పటికి తనజతపనివారితోఁ గలిసి దైవసేనను నెమ్మదిగా సాగించుటకు లూథరుకు సదవకాశము కలిగెను.

వార్టుబర్గులో జర్మనీభాషలోనికిఁ దర్జుమాచేసిననూతన నిబంధనను ప్రచురించిరి, పాతనిబంధననుగూడ తర్జుమాచేయ మొదలిడెను. తనకుఁగావలసిన యుపకరణములనేకములు లేనప్పటికి, లూథరీకష్టతరమగు పనినారంభించెను. "యోబు గ్రంథముయొక్క తర్జుమానుగూర్చి లూథరు "ఫిలిప్ మెలాంక్తన్" ఔరోగలస్, మఱియు నేనున్న గలసి నాలుగు దినములు ప్రయత్నించినను, మూడు వరుసలుకూడ బూర్తిచేయ లేకపోతిమి. ఇప్పుడు దానిని జర్మనీభాషలోనికి తర్జుమా చేసితిమి. కాఁబట్టియెవ్వరైనను జదివి సులభముగా నర్థముచేసికొనవచ్చును. దారిలోనున్న రాళ్ళు, రప్పలనుగమనించకయే సులువుగా మూడునాలుగు పుటలొకేసారి చదువవచ్చును. చదునుగానుండుటకుఁ త్రోవలోని రాళ్ళను, రప్పలను దీసి వేయుటకు మేమెంతో కష్టపడవలసి వచ్చెను" అనినుడివెను.

పాతనిబంధనయొక్క తర్జుమాను పూర్తియైనవానిని భాగములు భాగములుగాఁ బ్రచురించిరి. 1534 లో సంపూర్ణముగా బైబిలంతయుఁ దర్జుమాచేయఁబడెను. అప్పటికప్పుడు

అనేక విద్వాంసులు లూథరునుచేరి యవసరమైన వోట్ల నెల్ల తర్జుమాలో భాషనువృద్ధిపఱచిరి. ఈరీతిగా జర్మనీభాషలో లూథరుచే 'తర్జుమా' చేయబడిన బైబిలు బయటికివచ్చెను. దానినిగుఱించి మెలాంక్తిన్ జర్మనీభాషలోని బైబిలు దేవుఁడు లూథరు ద్వారా కడవరిగడియలలో బూర్తిచేసిన యొకగొప్ప కార్యము" అని యనియెను.

లూథరీపనిలో నిమగ్నుఁడై యుండఁగా తానుచేయ వలసిన కర్తవ్యమెక్కువగా నుండెను. ఆరాధనను, పోపులేర్పాటుచేసిన రీతినిగాక, విశ్వాస సూత్రములనన్నుసరించి యేర్పాటుచేయవలసివచ్చెను. అనఁగా బోధించుట, వ్రాతపూర్వకముగా లూథరుదీనిని సాధించవలసి వచ్చెను. అతఁడావిధముగాఁజేసి ప్రత్యేకపుటారాధన లేర్పాటుచేసి, పాత్రనం దఱికిచ్చి, పిచ్చియలవాటులన్నిటిని మార్చివేసెను. బహిరంగపుటారాధనలు మాతృభాషలో జరుపబడి, జర్మనీభాష లోనే పాటలు పాడిరి. మాతృభాషలో ననేక కీర్తనలను లూథరు వ్రాసెను.

"మాకర్తా! గట్టిదుర్గము" అను కీర్తనను బట్టి వానిని వ్రాయగల శక్తియతని కున్నదని తేటతెల్లమగుచున్నది. అతఁడు వ్రాసిన కీర్తనలతివేగముగ జర్మనీదేశమంతయు వ్యాపించెను. సువార్తచూపించు వెలుఁగును, ఆదరణనుగూర్చి యీకీర్తనలద్వారా జర్మనీదేశమంతయు వ్యాపించెను.

లూథరు పాఠశాలను గూర్చి కడుజాగ్రత్త తీసికొనెను. మంచిపాఠశాలలు ప్రతిచోటను స్థాపించఁబడవలెనని యతఁడాశించెను. "మనముచిన్నవారికి సలహాల నిచ్చుట, సహాయమొనర్చుట యనునది క్రీస్తుకును, లోకమునకును మిగుల హితమగునట్టి విషయమని లూథరనెను.

1528 లో 'ఎలక్టరు' గారు తన శాక్సనీదేశములోనున్న సంఘములన్నింటిని లూథరు దర్శించవలయునని కోరియుండెను. చాలస్థలములలో మతవిషయములు కడు విషాదకరములుగానుండెను సంఘముయొక్క "ఆత్మీయ గుడ్డితనమును" పోఁగొట్టుటకై - 1529 లో - పెద్దప్రశ్నోత్తరిని, చిన్నప్రశ్నోత్తరిని లూథరు వ్రాసెను. చిన్న ప్రశ్నోత్తరిని సంఘబిడ్డలకెంతయో యుపయుక్తముగా నుండెను. లూథరు తలంచిన రీతిగా దీని నుపయోగించినచోట నెల్లను నదియాశీర్వాదకరముగా నుండెను. తన పని ఫలితములను దానే చూడగలిగి సంఘబిడ్డలు ప్రశ్నోత్తరిలోను, దైవగ్రంథమందును బొందుచున్న తర్ఫీతునుబట్టి చూడఁగా నిదివఱకుకంటె వారెంతగా నిప్పుడు ప్రార్థించుట, విశ్వసించుట, క్రీస్తునుగూర్చి సాక్ష్యమిచ్చుటయనునవి చేయవలసియున్నారో" యని లూథరనెను.

లూథరు వివాహస్థితికిఁదగిన ప్రాధాన్యమిచ్చెను. ఇట్టిస్థితి దేవుని వలన నేర్పాటుచేయఁబడి, క్రీస్తుయొక్క ఆమోదమును బడసినదైనప్పటికి నది యసహ్యాకరముగా పోపులవలన

తలంచబడెను. వివాహము పరిశుద్ధమైనదని యితరులకు బోధించినమాట సత్యమేగాని వారు మాత్రము దాని నపరిశుద్ధబఱచిరి. పోపు, సన్యాసులు, సన్యాసినులు వివాహమాడకూడదని నిషేధింపబడి, వివాహము పరిశుద్ధముగా నెంచి పరిశుద్ధులు దాని నసహ్యించుకొనిరి. సైతాను వలనఁ గలిగిన యీదుర్బోధను లూథరు దేవుని వాక్యముద్వారా ఖండించి, పరిశుద్ధులైన పితామహులు, ప్రవక్తలు, పూజారులు, అపోస్తలులు, మొదలగువారు వివాహమాడినవారే, యని దైవగ్రంథమునుండి చూపించి, యిట్టిస్థితి దేవునికిష్టమైనదని ఋజువుచేసెను. ఈరీతిగా గురువులు మఠములలోనున్న సన్యాసులు వివాహ నిషేధమునుగూర్చి చేసిన ప్రతిజ్ఞలు పోపుల యధికారమునకు విరుద్ధములే- కాని దేవుని వాక్యమునకు విరుద్ధముకాదని బోధించెను. అనేకులు దేవుని వాక్యమును నమ్మి, పోపుల సంకెళ్ళను త్రెంపి వివాహములు చేసికొనిరి. అందువలనఁగలిగే దుష్ప్రచారమునగూర్చి భయపడి వైవాహిక స్థితిలోఁ జేరరైరి. ఇంకను కొందరు సంపూర్ణ స్వతంత్రులై యుండక కొంతవఱకు జంకుచుండిరి. ఎందుకనఁగా లూథరింకను పెండ్లిచేసికొనలేదు. చివరకుఁ తానే పెండ్లాడ నిశ్చయించుకొనెను. జూన్ 13, 1525 తేదీన సన్యాసినిగా నున్న క్యాథెరిన్ వాన్ బోరాను పెండ్లాడెను. డాక్టరు బ్యూగిన్ హేజెన్ వివాహ సంస్కారమును జరిపెను.

లూథరు యొక్క పెండ్లిని గూర్చి విరోధులు తమ విషమును గ్రక్కుటకొక మిషయయ్యెను. కాని యతని పోపుల యాచారమను వలకు వేసిన చిల్లికి మాసిక కుదరదయ్యెను. అప్పటినుండి గురువులు, సన్యాసులు వివాహమాడి సంఘమునుండి వేరైరి. లూథరు యొక్క పవిత్రమైన వివాహమును వారపరిశుద్ధముగాఁ దలచినను సంతోషకరమైన కుటుంబ జీవితము లూథరునకు గలుగుటవలన వారు వేనోళ్ళ దేవుని స్తుతించిరి.

వైవాహికస్థితిలో లూథరు ప్రవేశించుటవలన - దుర్మార్గులిప్పటికి నాతని యాశయములఁగూర్చి దురభిప్రాయముల బడుచుందురు. కాని సర్వజ్ఞులగు ప్రొటస్టెంటులు లూథరు యొక్క గృహస్థ జీవితమును గొనియాడుచు, మానవ కల్పనవలనను, పోపుల తప్పుడు బోధలను ధైర్యముతో లూథరు ఖండించఁ గలిగెనని యాతని గొనియాడుచుందురు.



# పంచమ భాగము

## దిద్దుబాటు యొక్క వ్యాప్తి

స్పైర్సు పట్టణమునఁ దిరుగుబాటు జ్ఞాని యనఁబడిన "ఎలెక్టరు ఫ్రెడెరిక్" గారు మే 5, 1525 లో తన రక్షకుడైన యేసుక్రీస్తునందు విశ్వాసముంచి మరణించెను. తన సోదరుఁడును, – స్థిరుడని బిరుదాంకితుఁడునగు – జాన్ తన స్థానే ప్రవేశ మయ్యెను. దిద్దుబాటునకు జాన్ దోహదమిచ్చెను. ఇతర ప్రభువులును, లూథరు చేసిన దిద్దుబాటును ప్రవేశపెట్టిరి. వారిలో హెస్సీపరగణా ప్రభువగు ల్యాండుగ్రేవ్ పేరెన్నఁ దగినవాఁడు.

పదియవ లియోయను పోపు 1521, డిశంబరు 1వ తేదీని చనిపోయెను. 'ఆరవహాడ్రియన్ అను' నాతని తరువాత పోపుగా నేర్పాటై, లూథరుయొక్క మతభేదాభిప్రాయములను ఖండించగలననుకొని తానే కొన్ని మార్పులను సంఘములోఁ దీసికొనివచ్చెను. ఈరీతిగా జేసిన యెడల జర్మనీ దేశపు ప్రభువులను వశపరచుకొనెదననుకొనెను. కాని యతఁడు 1523 సెప్టెంబరు 24న చనిపోయెను. అతనిదనుక వచ్చిన "నేడవ క్లెమెంటు" దిద్దుబాటును నధికార బలములతో నణచఁజూచెను. 1524లో నర్ను బర్గులో జరిగిన సభయెదుట నేమాత్రమును నెరవేర్చలేకపోయెను. కాని సభ ముగిసిన

తరువాత నతని యభ్యర్థియగు 'కాంపెగ్గి' రెజెన్సుబర్గు పట్టణమున రోముతో నేకీభవించిన ప్రభువులను, దక్షిణ జర్మనీదేశపు బిషప్పులను సమకూర్చి దానికి చక్రవర్తి యొక్క సోదరుఁడగు ఫెర్డినాండును నాయకునిగా నేర్పాటుచేసి మహాసభనొకదానిని జరిపించెను. దిద్దుబాటు నణఁచుట కేర్పాటులు చేయఁబడెను. లూథరుబోధల నంగీకరించిన ప్రభువు. లేకమైయుండుట యగత్యమనితలంచి మే నెల 1526లో 'తోర్గాలో' సంధి చేసికొనిరి.

ఇంతవఱకు దిద్దుబాటు తెంపు లేకుండ జరుగుచునేయుండి, జర్మనీ సరిహద్దులనుదాటి యితర దేశములకుఁ బ్రాకెను. పులిసిన పిండివలె సువార్త 'ఐరోపా' ఖండమంతయు వ్యాపించెను. కాని పోపుల సంబంధీకులు దానినరికట్ట విశ్వప్రయత్నములు చేసిరి. 1529 లో స్పైర్సులో జరిగిన ద్వితీయ మహాసభ యందు రోమీయులధిక సంఖ్యాకులు. వారక్కడెవరును లూథరు బోధలను చెవిని బెట్టరాదనియు, రోమునుండి బోధించెడిబోధలఁ గైకొనవలసినదని తీర్మానించిరి. దీనికంగీకరించినయెడల దిద్దుబాటంతరించవలసి యుండెడిది. కాని లూథరన్ ప్రభువులు వారి యసమ్మతిని దెలిపిరి. వారు వేరై, సభయొక్క తీర్మానమునకు వ్యతిరేకముగా వారొక తీర్మానమును జేసిరి. అధికసంఖ్యాకులు చేసిన తీర్మానమునకు లోఁబడుటవఁగా నేను

క్రీస్తును, ప్రభువుగాను, రక్షకునిగాను, తోసి వేయుటయని భావము. వారును వారిబోధకులతో దేవుని వాక్యప్రకారము ప్రవర్తించుట క్షేమకరమనియు, దేవుని, వాక్యమును దేవుని వాక్యముతోనే యర్థముచేసి కొనవలయుననియు, దేవుని సహాయమున నట్టివిశ్వాసమునందే, స్థిరులమై, యుందు మనియు, ప్రకటించిరి. "ఇదంతయు వ్యర్థమైన యెడల, నందఱి హృదయముల పరిశోధకుడును, నొక్కడే సృష్టి కర్తయు, విమోచకుఁడు, రక్షకుడైన దేవుని సన్నిధిలోను, మానవులందఱి యెదుటను, సకలసృష్టియెదుటను మా విశ్వాసమును వెల్లడి చేయుచున్నాము. మేము, మాయనుచరులును, దేవునికి నాయనపరిశుద్ధ వాక్యమునకును, మానవుల కేర్పాటు చేయఁబడిన రక్షణకును, మనస్సాక్షికిని, 1526లో చేసిన తీర్మానమునకును వ్యతిరేకముగా నున్న దాని నంగీకరించక పోవుట మాత్రమేగాక యనువమాను వర్తించక వృథా విశయమై యున్నవి" అని చివరగా ముగించిరి.

ఇప్పటినుండి యీ మతాభిప్రాయము వలన లూథరనులు ప్రొటస్టంటులని పిలువఁ బడిరి. స్పైర్సులో జరిగిన రెండవ సభలో దీని కన్న నెక్కువగ నెరవేర్చిరి. క్రీస్తుయేసు వలన దప్ప మరెవరివలనను రక్షణకలుగదనియు, ఆయన వాక్యమున బొరపాటు లేదనియుఁదమ విశ్వాసమును వెల్లడిచేసిరి.

## 2. మార్బర్గు సంవాదము.

సాక్షరను ప్రభువుల విరుద్ధాభిప్రాయము చక్రవర్తి కిష్టము లేకపోయెను స్పైరస్సులో జరిగిన సభాతీర్మానమునకు మరేతు లేమియు లేకుండా లోఁబడవలసినదని కోరెను. మఱియు జర్మనీలో మతబేధాభి ప్రాయముగలవారి నందఱిని దిరిగి సంఘములోఁ జేర్చెదనని పోపుతో నొడంబడిక చేసి కొనిన కారణమున లూథరను ప్రభువులకు మఱియెక్కువ కష్టతరముగా నుండెను. హెస్సీప్రభువగు లాండ్ గ్రేవ్ ఫిలిప్ ప్రొ ట స్టం టు లు వారిలో వారు చక్రవర్తితో సంధి చేసి కొనవలెనని ప్రయత్నించిరి. లూథరు దానికి సమ్మతించ లేదు. మొదటికారణము, దైవభక్తిమీద నాధారపడక మానవశక్తి మీదనే యాధారపడుట. రెండవది.· యట్టి సంధిలో జ్వింగ్లియనులనుగూడ జేర్చుకొని వారిని ప్రోత్సాహ పరచవలసి యుండును. మొదటికారణము వారికి నచ్చనప్ప టికి రెండవది నచ్చెను. శాగ్జని దేశపు ప్రభువగు ఎలెక్టరు జాన్, బ్రాండెన్‌బర్గు ప్రభువగు మార్ గ్రేవ్ జార్జియున్ను, జ్వింగ్లి సిద్ధాంతముల నంగీకరించిన వారితో, నేమియు సంబం ధముండఁ గూడదని యభిప్రాయపడిరి. లూథరు జర్మనీలో దిద్దుబాటు నారంభించిన కాలములోనే, స్విట్జర్లాండులో జ్వింగ్లియారంభించెను. రెండు సంవత్సరముల యనంతరము జ్యూరిచ్ పట్టణగురువుగా నేర్పాటాయెను. పోపుల యధి

కారమునకు వ్యతిరేకముగాఁ జేసిన బోధలు బలకరముగా నుండెను. కాని జ్వింగ్లి లూథరు కాదు. తనకనేక వరములు, వాక్యానుభవములున్నప్పటికి లూథరు సంస్కర్తగా నగుటకున్న లక్షణములు, జ్వింగ్లీకి లేకపోయెను. లూథరు తన పోరాటము వలన, ననుభవము కలిగి దేవుని యపారకృప యే విధముగా బనిచేయుచున్నదో గుర్తెరిగెను. కాని జ్వింగ్లి యట్లు కాదు. అతనిలో లూథరుకున్న దైవవాక్యానుభవము, కదిలింపఁబడని దేవుని యెడగల విశ్వాసము, జ్వింగ్లియందు గనబడలేదు. "అతఁడు మానవజ్ఞానముమీదను, శక్తిమీద నెక్కు వనాధారపడెను. జ్ఞానమునకు మించిన సిద్ధాంతములు దైవవాక్యముబోధించు నపుడు వాటినుండి యతఁడు తొలగి పోయెను. ప్రభు రాత్రిభోజన సంస్కారమునుగూర్చి మఱియు ముఖ్యముగా భేదాభిప్రాయములు కలిగెను. రొట్టె ద్రాక్షారసములు నిజమైన శరీరము, రక్తములు కావనిబోధించెను. క్రీస్తుయొక్క మాటలను "ఇది నాశరీరము, మొద॥" వాని నతఁడు "ఇది నాశరీరమును సూచించును, మొద॥" అని బోధించెను. పరిశుద్ధిసమభాక్త్వమును క్రీస్తును జ్ఞాపకముచేయు నట్టి విందు మాత్రమేనని బోధించెను.

చపల చిత్తుడైన కార్లుస్టాట్ విట్టెన్‌బర్గునుండి పారి పోయినపుడు స్విట్జర్లాండులో నాహ్వానింపబడెను. 1524 లో ప్రభురాత్రిభోజన సంస్కారమును గూర్చి బోధించిన సిద్ధాంత

ములకు వ్యతిరేకముగా నతఁడు వ్రాసెను. జ్వాంగ్లీకూడ మరొ కటి ప్రకటించెను. బేసెల్ వాఁడైన ఒకోలాంపాడియస్ అత నితోఁ జేరెను. లూథరుయొక్క యనుచరులను, ఉత్తరము లును, ప్రచురణముల ద్వారా వారిని జేరబ్రయత్నించెను. లూథరొక సంవత్సరము వఱకు జవాబియ్యలేదు. జవాబిచ్చిన యెడలఁ తన వాదుక ప్రకారము లోటులేకుండా జవాబిచ్చెడి వాఁడు. జింగ్లియున్ను హాస్యాస్పదముగాను, నిందతోను జవా బిచ్చెడివారు. మూడు సంవత్సరములలో నందఱుతన సిద్ధాంత ము నామోదించెదరని బడాయికొట్టెను. అతఁడు భావించినది చాలతప్పని మనకు దెలియును. సమభాక్త్వముచుండి ప్రొట స్టంటులు విభాగములై పోవలసి యుండెను.

హెస్సీప్రభువగు లాండ్ గ్రేవ్ సమభాక్త్వమును గూర్చిన సిద్ధాంతము బేదాభిప్రాయములు కలుగఁజేసినదని తెలిసికొని యాబేధములను తొలగింపఁ బ్రయత్నించెను. లూథరున్ను, జ్వింగ్లీయున్ను గలసి, తరిఁచించి యేదోయొక యభిప్రాయము నకు రావలయునని ల్యాండ్ గ్రేవ్ కోరియుండెను. మార్గ్ బర్గు కోటలోఁగలసి కొనవలెనని యాహ్వానించెను. తనమనస్సాక్షి జ్వింగ్లీ చెప్పుదానిని నిరాకరించునని తెలిసియు, దన ప్రతికూలుఁడు మాటవినేవాఁడుకాదని తెలిసియు నయిష్టముతో నొప్పుకొనెను. మెలాంక్తను, ఎలక్టారు ఇద్దరుకూడ నీవిభాగమున కసమ్మతిని దెలిపిరి. కాని చివరకు ల్యాండ్ గ్రేవ్ కోరికయే నెరవేరెను.

లూథరు మార్గ్బర్గునకు సెప్టెంబరు 30, 1529 న మెలాంక్తన్, జోనాస్, క్రూసిగర్, మైకోనియస్ లతో చేరెను. తరువాత బ్రెంజ్, డిసియాండర్, అగ్రికోలాలు కూడా విచ్చేసిరి. అంతకొకరోజుముందే ఓకొలాంపిడియస్, భూసర్, హీడియో మఱికొందరు సలహాలతో వచ్చిరి

సంవాదము అక్టోబరు 1న ఆరంభమైనది. సమభాక్త్వ మునుగూర్చి మాత్రముగాక క్రైస్తవయితరవిశ్వాసముగూర్చి వేరే సిద్ధాంతములు బోధించెను. కాబట్టి క్రైస్తవసంఘ సమభాక్త్వములో దీనినిగూర్చి యాలోచించవలసిన యగ త్యత గలదు. లూథరు బోధలన్నిటిని నతఁడొప్పుకొనెను. గాని సమభాక్త్వమునుగూర్చి మాత్రము భేధాభిప్రాయము కలిగియుండెను. "ఇది నాశరీరము మొ॥" వాసని లూథరు, ఆశ్చర్యముతో గ్రహించెను. సుద్దముక్కతో బల్లపైవ్రాసెను. జ్వింగ్లివాని భావమునకే స్థానమిచ్చి "ఇది నాశరీరమును" సూచించును'' అని బోధించెను.

ఈభేదాభిప్రాయమునుగూర్చి వ్రాతలో నుండవల యునని లూథరు వక్కాణించి యట్లేవ్రాసెను. వారిద్దఱు 14 అంశములమీఁద నొకే యభిప్రాయమును గలిగియుండిరి. 15వ అంశములో వారెంతవఱకు నేకీభవించిరో యీక్రిందిమాటల మూలమునఁ దెలియఁగును. "రొట్టెద్రాక్షారసములలో క్రీస్తు యొక్క శరీరరక్తములను గూర్చిన వివాదములో మేమెంత

మాత్రము నేకాభిప్రాయమునకు రాకపోయినప్పటికిని ఇరు పక్షములవారొకరి కొఱకు మరొకరు క్రైస్తవ ప్రేమను జూపుచు సరియైన భావమును దెలిసికొనుటకై జాగ్రత్తతోఁ బ్రార్థించ వలయును. ఆమేన్”

జ్వింగ్లి కరస్పర్శ చేయుటకై తనచేతినిఁ జాపఁగా లూథరీమాటలతో వెనుకదీసెను. “మాకుగల యాత్మకును మీకున్నయాత్మకును తేడాయున్నది.” ఈతేడా స్వల్ప మాత్రమేయని లూథరు భావించలేదు. లూథరు వ్రాసిన శీర్షికల వల్లను, ఉభయ పక్షముల వారు వ్రాసిన వ్రాతల మూలమునను సోదర భావము కానప్పటికి స్నేహ భావము కలిగెను.

అక్టోబరు 5 వ తేదీన లూథరు విట్టెన్ బర్గునకుఁ బ్రయాణమయ్యెను. అక్కడఁ దన మొదటి ప్రసంగములో నీ వివాదమునుగూర్చి మాట్లాడుచు స్నేహాభావమును, సోదరైక్యతగా మారుటకుఁ బ్రార్థించవలయునని సభను హెచ్చరించెను. జ్వింగ్లి యింటికిఁ దిరిగివచ్చి లూథరును గెలిచితినని బడాయి కొట్టెను.

రెండేండ్ల తరువాత జ్వింగ్లి యనులకును, పోపు పక్షము వారికిని స్విట్జర్లాండులో యుద్ధమారంభమయ్యెను. జ్వింగ్లి యుద్ధమునకు వెళ్ళి 1531 లో కేపెల్ అనుయుద్ధభూమిలో హతమొందెను.

## 3. ఆగ్సుబర్గులో నొప్పుదల

లూథరనుల, మతభేధాభి ప్రాయములను బలవంత ముగా నాపుచేయవలయునని పోపు చక్రవర్తిని 'ఒత్తిడి' చేయుచుండెను. కానితురుష్కులు తన సోదరుడైన హంగారి ప్రభువగు ఫెర్డినాండుపై దండెత్తవలెనని ప్రయత్నించు చుండగా, లూథరన్ ప్రభువుల సహాయమతనికిఁ గావలసియుండి పోప్రుగారి కోర్కెను నెరవేర్చలేకపోయెను. కాఁబట్టి మత భేధాభి ప్రాయములను దొలగించ నుద్దేశించి మఱియొక ప్రయత్నమును జేసిచూచెదనని తలంచి ఏప్రియల్ 1530 లో ఆగ్సుబర్గులో నొకసంఘసభను జేకూర్చనుద్దేశించెను. చక్రవర్తి గారు "ఒకరియొక్క యభిప్రాయమును, మరియొకరి అభి ప్రాయము నెడఁప్రేమ, దయగలిగి సూక్ష్మబుద్ధి నుపయోగించి క్రైస్తవ సత్యాన్వేషణము చేయవలయుననియు నిదివఱకుగల భేధాభిప్రాయముల, నెడబాపుచేయఁ బ్రయత్నించ వలయు ననియు బ్రతి సామంతదేశమునకు తాకీదంపఁ బడెను.

తన భాషచాలా సమాధాన కరముగా నుండెను. కాని యట్లుజరుగునని భావించుటకు వీలగునా?

ఎలెక్టారు సభకు హాజరగుటకు వెంటనే సిద్ధపడెను. ఆయన వేందాంతులతో "మతవిషయము లే విధముగాఁ బరిణ మించినవో చూడుఁడు. ప్రతి విషయము మీరు సరిగా జవా

బియ్యగలమని పూర్ణవిశ్వాసము మీకుండిన యెడల సరియే. లేనియెడల, మనదేశమునకేమున్నా వాటిల్లునని గ్రహించుడి" యని నుడివెను. వారి మూలమున సామ్రాజ్యమునకెట్టి యుపద్రవము వచ్చుట వారికిష్టము లేదనియు, వారి పక్షము గా నెలక్టారు నిలబడని యెడల శెలవిచ్చిన యెడల దామే స్వయముగా చక్రవర్తిని దర్శించి సభకుహాజరయ్యెదమనియుం దెలిపిరి. "దేవుడు నన్ను మీ స్నేహమునుండి యెడబాప కుండును గాక! మీతో నా ప్రభువును గూర్చి సాక్ష్య మిచ్చెదను" అని ఎలాక్టారనెను.

ఏప్రియల్ 3 వ తేదీని అత డాగ్జుబర్గునకుం బయన మయ్యెను. అతనితో డాక్టరు లూథరు, ఫిలిప్ మెలాంక్తను, జెస్టస్ జోనాస్, జార్జిస్పెలాటిన్, న్యాయాధిపతులగు డాక్టర్ బ్రల్, డాక్టరు బ్రెయరులుకలిసి వెళ్ళిరి లూథరుబహిష్కరింపం బడినకారణమున, ఆగ్జు బర్గులో దనకుక్షేమములేదని కోబర్గు కోట యందుండవలసి వచ్చెను. ఆగ్జుబర్గులో జరుగుచున్న విషయములన్నిటి నప్పటికప్పుడే లూథరుకుం దెలియచేయు చుండిరి. అతడు వారికి సలహానిచ్చుచుం బ్రార్థించుచుండెడి వాడు.

ఆ మహాసభయెదుట వారి విశ్వాస సూత్రములను జదువుటకై ఎలక్టారు వేదాంతులను తయారుచేయుమని కోరెను. లూథరు మార్బర్గు, స్వాబర్గులలో సిద్ధపరచిన

యంశములను దీసికొని, వారు మరల వానిని దిరుగ వ్రాసి చివరకు మెలాంక్తనుచే బూర్తిచేయబడి, ఆగ్జుబర్గు నొప్పందల యనెడి పేరుతో నవి సంపూర్ణమాయెను. సభయెకట, జదునకముందు, లూథరు వానిని సంపూర్ణముగాఁ బరీక్షించి, తనయనుమతి నిచ్చెను.

ఇతర లూథరన్ ప్రభువులున్ను ఆగ్జుబర్గులో సమావేశ మైరి. చేరవలసిన గడియకుఁ జక్రవర్తి చేరక, పట్టణసమీప మున కతఁడు ప్రవేశింపగాఁ ప్రభువులందఱతని నెదుర్కొనఁ బట్టణము వెలుపలికి వెళ్లి తగిన గౌరవముఁ జూపుచుఁ గలసి కొనిరి. మరుసటిదినము కార్పస్ క్రిస్టియనుపండుగ దినము. ఆ దినమున లూథరన్ ప్రభువులు తమబోధల నాటంకపఱచ వలయునని యుత్తర్వు చేసెను. ఊరేగింపులో జొల్గొన నిష్ట మును దెలిపిరి. పోపుల సంబంధికుల బోధలనుగూడ నరికట్టిన యెడల, తాము నట్లుచేయుదుమని చక్రవర్తికిఁ దెలియఁజేసిరి.

జూన్ 20 న సభ ప్రారంభమయ్యెను. జూన్ 24 న తమ విశ్వాసమును వెల్లడిచేయవలయునని లూథరనులు చక్రవర్తియనుజ్ఞ పొందిరి. చక్రవర్తి వారి విశ్వాసమును వ్రాత రూపమున దనచేతి కందజేయ వలయునని కోరియుండెను. డాక్టర్ బ్రెల్‌గారి కోరిక ప్రకారమది చదువఁబడుటకు శల వయ్యెను. ఆదినమున కాలస్యమాయినందున మరుసటిదినమున జదువఁబడుట కనుజ్ఞాయెను.

జూన్ 25 సాయంత్రము 3 గంటలకు 200 మందితో సభకూడెను. అంతకన్న నెక్కువమంది చేరకూడదని రోమీషాయులు కోరిరి. శాగ్జనుదేశపు న్యాయమూర్తులగు డాక్టర్ బ్రేయర్, డాక్టరుబర్లిల్ హాలుయొక్క మధ్యభాగమున నిలువఁబడిరి. మొదటివారి చేతిలో జర్మనీభాషలోను, రెండవవారి చేతిలోల్యాటినుభాషలోనుదయారైననకలులుండెను. ల్యాటిన్ భాషలోఁ జదువవలెనని చక్రవర్తి కోరెను. కాని ఎలక్టారుజాన్ చెప్పినదేమనఁగా వారు జర్మనీదేశములో నున్నారు, కాఁబట్టి జర్మనీభాషలో జదువశలవియ్యవలెనని కోరెను. చక్రవర్తి సమ్మతించెను. తదనంతరము డాక్టరుబేయరు బైటనున్న జనసమూహమంతయు వినఁగల పెద్దస్వరముతో జర్మనీభాషలోఁ జదివెను. చదువుటకు రెండుగంటలకాలముపట్టెను. క్రీస్తును, ఆయనపరిశుద్ధసువార్త నితరులముందొప్పుకొనుటకు నాత్మయందుశక్తినొందినవారై బహుధైర్యపర్చఁబడిరి. దేవుఁడుతన వినయసేవకుల ద్వారా తనసత్యమనె వెలుగును ప్రకాశింపజేయఁగలిగినందులకు లూథరు దేవునినెంతో కొనియాడెను.

అగ్జుబర్గు ఒప్పుకోలునకు సంతకములుచేసినవారెవరనఁగా శాగ్జనిదేశపు ప్రభువగు ఎలెక్టారుజాన్, బ్రాండెన్ బర్గుప్రభువగుజార్జి, ల్యూన్ బర్గు ప్రభువగు ఎర్నెస్టు, హెస్సిప్రభువగు, ఫిలిప్, ఆన్ హాల్టు ప్రభువగు వుల్ఫుగాంగ్, నర్ను బర్గు, రేట్ లింజన్ పట్టణపురపాలక సంఘాధ్యక్షులు.

ఈయొప్పుకోలు రోమాపట్టణపు వేదాంతుల కనేక మందికియ్యబడెను. వారుదానికొక జవాబు తయారుచేసిరి. కానియదిచాల హీనముగానున్నదని చక్రవర్తిదానిని మరలం దిరుగ వ్రాయించెను. ఆగష్టు 3 వ తేదీకి దానినివారుపూర్తి చేసిరి. లూథరన్ ప్రభువులను జదువవలెననియాజ్ఞాపించెను. అప్పటినుండి సంఘములో విభేదములుండరాదనియు, సంఘ క్షేమమును గాపాడవలసినవాడు కాఁబట్టి యిక నెట్టి భేదాభిప్రాయములను దాను సహించననియుఁ దెలిపెను.

లూథరనులకు రోమీయులిచ్చిన జవాబుకాగితమివ్వ బడలేదు. చాలావిషయములను జ్ఞప్తికి దెచ్చుకొని వానికిజవా బిచ్చిరి. దానిమీద "ఆగ్జుబర్గు" ఒప్పుకోలు యొక్క వివర మును మెలాంక్తన్ వ్రాసెను. తరువాత,దనకొకజవాబుప్రతిక దొరికిన తరువాత తనవివరమును సవరించి ప్రకటించెను.

సెప్టెంబరు 23 న 'ఎలక్టారు' స్థిరుఁడైనజాన్ అనునామ దేయమునకుఁ దగినవాఁడైఆగ్జుబర్గును విడిచివెళ్ళెను. రెండు సంవత్సరములతరువాత, సరియైన విశ్వాసమునందుండఁగనే మరణించెను. అతనికుమారుఁడైన జాన్ ఫ్రెడరిక్ శాగ్జనిదేశపు ప్రభువాయెను.

## 4. స్మాల్ కాల్డు నిబంధనలు

ఆగ్జుబర్గులో నొప్పందముచేసినవారు చూపినధైర్య, స్థైర్యములనుబట్టి చక్రవర్తికిఁ గోపమును గలుగఁజేసిరి. వీరై

నంతత్వరలో వారికిఁ బ్రతీకారము చక్రవర్తి చేయుననితలంచిరి. అట్టితరి బరస్పరసహాయార్థము స్మాల్ కాల్డునొద్ద సమావేశమై యొకసంధి చేసికొనిరి. ఒకవేళ చక్రవర్తి దండెత్తినయెడల మనోవాక్కాయ కర్మలయందు నేకాభిప్రాయము గలిగి యుండనొక కట్టగాఁజేసిరి ఇది చక్రవర్తి కిష్టములేకపోయెను. తురుష్కుల భయోత్పత్తి విషయమై లూథరను ప్రభువులందఱు తురుష్కుల నెదిరించుటకు సమర్థులనితలంచి వారితో మంచిగా నుండదలంచి 1532 లో నర్నుబర్గునందు మతవిషయములలో శాంతి సమాధానములు చేకూర్చసమావేశమైరి. చక్రవర్తి లూథరనులతోఁ దాత్కాలికముగా సమాధానపడెను. సంఘ మహాసభ యొకటి మత భేదాభిప్రాయములను దేల్చువరకు నుభయపక్షముల వారు నెమ్మదిగానుండవలెననితీర్మానమాయెను.

మహాసభ నొకదానిని పోపుపిలుచునట్లు చక్రవర్తి చేయఁగలిగెను. కాని పూర్వపద్ధతిలోనే, యదిజరుగవలసి యుండెను. పోపుదానికి సర్వాధికారి. తనచిత్తానుసారముగా దీర్పు చెప్పవలసినది. దానిఫలితమేమనఁగా లూథరనులందఱు మతభేదాభిప్రాయము గలవారని తీర్పుచెప్పక తప్పదు. మహాసభలోఁ బ్రొటెస్టెంటులు దైవవాక్యమునుబట్టి తీర్పుతీర్చిన యెడల మహాసభ తీర్మానమున కొడబడుదుమనిరి. లేనియెడల మహాసభ యెదుటఁ దమభావములనుగూర్చి దెలిపెదమనిరి. కానిదాని తీర్మానములను బాటింపమనిరి.

1534 సెప్టెంబరులో నేడవక్లెమెంటుపోపు చనిపోయెను. అతని తరువాత వచ్చినపోపు మూఁడవ. పాలు, మహాసభ నొకదానిని 1537 మే నెలలో మాంటుయాలో నేర్పాటు చేసెను. ఆసభయెదుట నేవిషయములఁ జర్చించవలయునో వానిని స్మాల్‌కాల్టులోఁ జేరిసభచేసిరి. ఎలెక్టారుగారి కోరికపై లూథరు, కొన్నినిబంధనల నేర్పాటుచేసి తీసికొని వచ్చెను. వారి విశ్వాసమును వెలిబుచ్చుటకై లూథరన్ వేదాంతులు, ప్రభువులు సంతకములుచేసిరి. ఆమహాసభ, యనుకొనినట్లు జరుగలేదు. కాని 1545 లో నదిట్రెంటులోఁ గూడెను. స్మాల్‌కాల్డులో సంతకముచేయఁబడిన నిబంధనలు లూథరన్ సంఘముయొక్క స్మాల్‌కాల్టు నిబంధలని పిలువఁబడెను.

లూథరనుల విశ్వాససూత్రములు Book of concord అను గ్రంథమున గలవు. దానిలో "అపోస్తలు"ల విశ్వాస ప్రమాణము, నీకే యవిశ్వాసప్రమాణము, అతినేషియన్ విశ్వాసప్రమాణము, ఆగ్సుబర్గు ఒప్పుకోలు, దాని భావము, స్మాల్‌కాల్డు నిబంధనలు, లూథరు వ్రాసిన చిన్నప్రశ్నోత్తరి మఱియు సమాధాన సంధిసూత్రములు గలవు.

## 5. సమాధాన సూత్రములు.

లూథరన్ ఒప్పుకోలులలోఁ జివరిదగు సమాధానసూత్రము 1577 వఱకు బూర్తియై యుండలేదు. లూథరుయొక్క మరణానంతరము సంఘములో సిద్ధాంతములను గూర్చి

భేదాభిప్రాయములనేకములు బయలుదేరెను. చాలమందినీతి మత్వము, సత్క్రియలు, జన్మపాపము, స్వేచ్ఛామనస్సు, ధర్మ శాస్త్రము, సువార్త, సమభాక్త్యము మొదలగువాటిగూర్చి తప్పభిప్రాయమునుగలిగియుండిరి. కాని సత్యమును నిలబెట్టఁ గంకణము కట్టుకొనిన వారుకొందఱుగలరు. ఈ పోరాటమును సంఘములోఁగల గలిబిలి నూతనవిశ్వాసమొప్పు కోలువలనఁ బాతవిశ్వాస సూత్రములను బరీక్షించి దేవుని వాక్యమువలన మార్చబడిననే గాని యంతమొందదని గ్రహించిరి.

అనేక సూత్రిములను దయారు చేసిన తరువాత, సమాధానసూత్రిము చివరననేక వేదాంతులవలనఁ బూర్తి చేయ బడెను. వారిలో ముఖ్యులు కెమింట్సు, సెల్ నెక్కర్ మఱియు ఆంద్రియా. దానిని బెర్గన్ వద్ద 1577లో బూర్తిచేయుగూడిరి.

ఆగ్జుబర్గు యొక్క యొప్పుకోలు వార్షికోత్సవ సందర్భ మున, 1580 లో నీచివరి యొప్పుకోలు ముగ్గురు "ఎలాక్టరు" వలన 21 మంది ప్రభువులు, 22 కౌంటులు, 4 బేరన్లు, 35 పట్టణపరిధానులు, మఱియు సంఘపాఠశాలల బోధకు లునుదమ సమ్మతిని దెలిపిరి. దాదాపు 9 వేల మంది యొకే యభిప్రాయమును గలిగియుండిరి. అదే సంవత్సరము సమాధాన సూత్రమచ్చు వేయఁ బడెను. ఈ గ్రంథమునం దచ్చువేయఁబడిన యొప్పుకోలులన్నియు లూథరన్ సంఘము యొక్క విశ్వాస చిహ్నములని పేరొందెను.

# షష్టమ భాగము

## లూథరుయొక్క కుటుంబజీవితము, ఆశీర్వదింపఁబడిన మరణము.

### 1. కుటుంబమునకుఁదండ్రిగానున్న లూథరు

ఇది వరకుఁ జెప్పబడినట్లు లూథరు జూన్ 13, 1525 లో కాతరీన్‌వాన్ బోరాను వివాహమాడెను. విట్టెన్ బర్గులో అగస్టస్‌కుఁ జెందిన మఠమును వివాహబహుమతిగా ఎలక్టారిచ్చెను. 1 తిమోథి 3:4 లో జెప్పబడినట్లు బిషప్‌కుఁ దగిన లక్షణములను గలిగి తన స్వగృహమును జక్కఁగాఁ బరిపాలించుకొనెను. తన భార్యను తగిన రీతిగా గౌరవించు కొనెను. పూర్వీకులవలెనే తన భార్య దేవునినమ్మి, తగిన రీతిగా నలంకరించుకొని తన భర్తకు లోఁబడియుండెను. (1 పేతు 3:5) లూథరు, తన భార్యపరిశుద్ధ వివాహమందు క్రైస్తవమాదిరివధూవరులువీరేయన్నట్లు ప్రకాశించిరి.

వారికి దేవుడు ముగ్గురు కుమారులను, ముగ్గురు కుమార్తెల, ననుగ్రహించెను. వారి మొదటి కుమారుఁడగు జాన్, జూన్ 7, 1526 లో జన్మించెను. అతనిని తనతండ్రి "హాన్సు" అని పిలుచువాఁడు. రాజనీతి యందుత్తీర్ణుడైన తరువాత, న్యాయవాదియై అక్టోబరు 28, 1575లో కోనింగ్సు బర్గులో మరణించెను. మొదటి కుమార్తెయగు,

ఎలిజబెత్ డిసెంబరు 10, 1527 లోఁ బుట్టి మరుసటి సంవత్సరము ఆగష్టు 3 న చనిపోయెను. మగ్దలేనయను నామె మే 4. 1530 న పుట్టి అక్టోబరు 20, 1542 లో చనిపోయెను. మార్టిన్ నవంబరు 7, 1531 లో పుట్టి, వేదాంతము చదివి మార్చి 3, 1565 లోఁ చనిపోయెను.

పాల్ జూన్ 28, 1533 లోఁబుట్టి వైద్యశాస్త్రమును జదివి, జేనాయను స్థలమునఁబండితుఁడుగా నుండి తరువాత ప్రైవేటు డాక్టరుగాను, అనేకమంది ప్రభువులకు సలహాదారునిగానుండి మార్చి 8, 1593 లో మరణించెను. మార్గరెటు డిశంబరు 17, 1534 లో జన్మించి హాన్ వాన్‌కున్‌హీమ్ యొక్క భార్యయై, 1570 లో పరలోకగతురాలయ్యెను.

ఘనుఁడగు డాక్టరు మార్టిన్ లూథరు సత్యవిరోధులగు వారితో నిత్యము పోరాడవలసి వచ్చినను, పాస్టరుగాను, ప్రొఫెసరుగా, నుండి సంఘశ్రేయస్సుకోరి విరామములేక కష్టపడినప్పటికిఁ గొంత వ్యవధిని సంపాదించి బిడ్డలకు మంచి శిక్షితు నియ్యగలిగెను. అపోస్తలుల కాలమునుండి నున్న వారికంటె నెక్కువ నేర్పు దేవుని వాక్యమును బోధించుటలో శక్తిగలిగి పోపు, చక్రవర్తులు, సామ్రాజ్యము, ప్రపంచ మంతటిని నెదుర్కొనఁ గలిగిన లూథరు, బిడ్డలతో నెట్లు మెలగవలెనో గుర్తెరిగి యుండెను. వారితో నాటలాడుచు, నవ్వునట్లు మాట్లాడుచు వారిపిల్లచేష్టలనుండి గంభీరమైన నీతు

లను బోధించుచుండెను. అగ్జుబర్గు సమావేశమున్పుడు తాను కోబర్గుకోటలోనుండి దేవునితో ప్రతిదినము ప్రార్థనఁ బోరాడుచు, నీతిజాగరూకతలను గలిగిన వాఁడైయుండియుఁ గుమారుఁడగు హాన్సుకొక లేఖయీక్రింది రీతిగా వ్రాసెను:-

"ప్రియమైన కుమారుఁడా, కృపాసమాధానములు మన ప్రభువైన యేసుక్రీస్తునుండి కలుగును గాక! నీవుబాగుగా జదువుటయు, చురుకుతనముగా ప్రార్థించుటయుఁజూచి సంతోషించుచున్నాను. నీవిలాగు ప్రవర్తించిన యెడల నేను నీకొక బహుమతిని దెచ్చెదను. నాకొకయందమైన యుద్యాన వనము తెలియును. దానిలోని బాలురు బంగారు వర్ణముగల, కోటులను దొడుగుకొని, అందమైనసీమరేగు, బేరిపండ్లు చెర్రిపండ్లు, రేగుపండ్లు నేరికొనుచు, నాట్యమాడుచు, పాటలు పాడుచు సంతోషముతో నున్నారు. బంగారుపు వన్నెగల కళ్ళెములను, వెండిజీనులను వేసికొని, గుఱ్ఱపుపిల్లలనెక్కి స్వారిచేయుచున్నారు ఎవరివనమనియు నెవరిబిడ్డలనియు నొకని నడిగితిని. వారు ప్రార్థన, విద్య, సత్ప్రవర్తనయందాశ గల బిడ్డలని యతఁడనెను. అందుకు నేను అయ్యా, నాకొక చిన్నహాన్సులూథరను కుమారుఁడు కలఁడు. అతఁడు కూడ నీవనములోనికి వచ్చిన చక్కని రేగుపండ్లు, బేరిపండ్లు తిని, యీయందమైన గుఱ్ఱపుపిల్లల నెక్కి యీబిడ్డలతో నాడుకొనవచ్చునా, యనియడిగితిని. అందుకతఁడు నీబిడ్డ

యిష్టాపూర్వకముగాఁ బ్రార్థించుము, విద్యాభ్యాసముచేసి, సత్ప్రవర్తనగలిగిన యెడల నతఁడుకూడ సీవనములోనికి రా వచ్చునని ప్రత్యుత్తరమిచ్చెను. లిప్పస్, జోస్టులుకూడ రా వచ్చును వారందఱు గలిసిన యెడల, బిల్లనగ్రోవి, మద్దెల మొదలగు సంగీతవాద్యములను బొందవచ్చును. నాట్యమున్ను, బాణముల నెగురవేయుటయుఁగూడ చేయ వచ్చును. అప్పటికి బిడ్డలు భోజనము చేయని కారణమునవారి నాట్యమును నేను చూడలేదు. నేనతనితోఁ జెప్పినదేమనగా అయ్యా, నాకుమారునికి బాగుగా ప్రార్థించుమనియు చదువు మనియు సత్ప్రవర్తన గలిగియుండిన యెడల నతడిక్కడికి రావచ్చుననియు వ్రాసెదను. అతనికొక లీనాయను బంధువు గలదు. ఆమెనుగూడఁ దీసికొనిరావచ్చునా యని యంటిని. అందుకతఁడు అలాగేకానిమ్ము- పోయిమీరతనికి వ్రాయుఁడు" అని యనెను. కాఁబట్టి ప్రియకుమారుఁడా, బాగుగాఁ జదువుము. ప్రార్థించుము. లిప్పస్, జోస్టులకుఁగూడఁ జదువుమని యుఁ బ్రార్థించుమనియుఁ జెప్పుము. అప్పుడు మీరందఱు గలసిరావచ్చును. దేవుని చిత్తమునకు మిమ్ములనందఱినప్ప గించుచున్నాను. లీనా బంధురాలికి నావందనములనిమ్ము. 1530 ఇట్లు, నీప్రియతండ్రి, మార్టిన్ లూథరు".

భక్తిగల క్రైస్తవ కుటుంబమునకు తండ్రివలెఁ తన బిడ్డలను క్రైస్తవరీతిగాఁబెంచవలెనని యాశపడెను. పాఠశా

లలో నేర్చుకొను సాధారణవిద్యనుబట్టిగాని, బడిలో నింటిదగ్గర నేర్చుకొను మతవిద్యనుబట్టిగాని యాతనికిఁ తృప్తిలేకపోయెను. అతఁడే స్వయముగా షర్లోకత్తరిని నేర్చి, యింకనుసరియైన కాలమును బిడ్డలకొఱకు వినియోగపఱచలేదని బాధ పడెడివాఁడు. ఇంటిలోఁ గ్రమశిక్ష, వెంటనే లోఁబడు స్వభావ ముండవలెనని కోరెను. కుమారుఁడు చనిపోయినను పరవా లేదు, కానియవిధేయతగల కుమారుడవసరము లేదనెను.

కుటుంబము తండ్రికి రావలసిన కష్టములనుండి తప్పించుకొనలేదు. ఎలిజబెత్తుకుమారి మరణించి నప్పుడొక స్నేహితునికి 'నాచిన్నికుమారియగు "ఎలిజబెతు" చనిపోయెను. ఆడది యేడ్చినట్లేడ్చితిని. బిడ్డలయెడఁదండ్రికంత ప్రేమయుండు నని నేననుకొనలేదు." అనియనియెను. లీనాయను కుమార్తె పదమూడవఏట జనిపోయెను. ఆమెమరణమతని నింకను బాధించెను. ఆమెమరణశయ్యపై నతఁడు కూర్చుండి, కుమారీ, మాగ్దలీనా నీతండ్రితో నిక్కడనేయుండుట నీకిష్టమే. కాని నీవు నీపరలోకపు దండ్రితో నుండుటకు మఱియు సంతోష ముగా నుండవలసినది; అని యనెను. అందుకులీనా. "అవును నాయనా, దేవుని చిత్తమైతే" అనియనెను ఆమెచనిపోవు నపుడు లూథరు మోకరించి యేడ్చుచు, నామెను తనసన్నిధికిఁ జేర్చుకొమ్మని ప్రార్థించెను. ఆమెయతని చేతులలో ప్రాణము

వదలెను. సమాధిపెట్టెలో నామెనుం బెట్టినపుడాతఁడనిన
దేమనఁగా "లీనా, నీవెంతధన్యురాలవు. నీవు మరల లేచి యా
కాశనక్షత్రములవలెఁ బ్రకాశించెదవు. ఆత్మను బట్టి సంతో
షించుచున్నాను. గాని శరీరమును బట్టి చాల దుఃఖించుచున్నాను"
తాను, తన భార్యయు, నెట్లోదార్పు పొందవలయునో? తెలి
యును. "నే మొక పరిశుద్ధురాలిని పరమునకంపితిమి. మాకట్టి
మరణము లభించును గాక! అట్టితరి నే నీక్షణమే మరణమొందు
టకు సిద్ధముగా నున్నాను." అనెను.

లూథరవసరములలో నున్నవారికి సహాయమొనర్చుట
కెల్లప్పుడు సంసిద్ధుఁడే. శక్తికి మించి ధర్మము చేయుచుఁ బేదల
యెడ జాలిగలవాఁడై యుండెను. అవసరములో నున్నవాఁడు
సహాయము కొఱకర్థించిన యెడల వెనుకాఁకువాఁడు కాఁడు.

ఈ గొప్ప సంస్కరణ కర్తతోఁ బరిచయముగల
వారతని యుదారబుద్ధి, ఆతిథ్యము, తృప్తి, అన్నపానీయము
లలో మితములను గూర్చి సాక్ష్యమిచ్చెడివాఁడు. తన జీవిత
ముద్వారా తనబోధనలకు వన్నెతెచ్చెను.

## 2. లూథరు జబ్బుపడుట.

లూథరు నిర్వర్తించిన పనిని బరీక్షించగా నతని దృఢ
మనస్సు స్థిరకాయములో నివసించెనని చెప్పవచ్చును. కాని
యది సత్యము కాదు. లూథరు తరుచుగా జబ్బుపడువాఁడు.
అతఁడనిన దేమనఁగా "జబ్బులచేఁ బరీక్షించబడిన రాజువంటి

వాఁడ"ననెను. పాపపరిహార పత్రికల నెదిరించిన దినములలో పోపుల యధికారమును ధిక్కరించగల బలమైన శరీరము లేక శవమువంటి వానివలె నుంటినని యనెను.

లీప్‌జిగ్ వివాదమున హాజరైన యొకరిట్లనెను. "న్యాయమూర్తియగు లూథరు మధ్యస్థముగానుండి విశేషముగా జదువుట వలనఁ దనయెముకలను గూడ లెక్కపెట్ట వచ్చును." అనియనెను. తరువాత సంవత్సరములోఁ గొంచెము లావయ్యెను. కాని తలతిప్పనెడి జబ్బు, చెవులలో గింగురు మనునట్టి శబ్దమును బుట్టించి, బాధకలిగించి యనివార్యమగు రోగముగా దయారయ్యెను. శరీరబాధలవలన ఆత్మీయశోధనలచే సైతాను వలన నలుగఁ గొట్టబడెను. సమాధికి సమీపముగా నున్నాఁడా యన్నట్లుకనఁబడెడివాఁడు-కాని యపోస్తలుని మాటలు "మనలను ప్రేమించినవారి ద్వారా మనము వీటన్నిటిలో ఆధిక్యత, విజయము పొందుచున్నాము" (రో 8:37) అతనియందు నెరవేరెను.

1527 లో గొప్పజబ్బొకటి యతనికి వచ్చెను. డాక్టరు జస్టస్‌జోనాస్‌గారిట్లు దానినిగూర్చి వర్ణించిరి. ఉదయమున నొకయాత్మీయ శోధనవచ్చి దినమంతటిలో దానినుండి నివారణ మొందెను. కానిరాత్రిభోజనమునకు డాక్టర్‌జస్టస్‌గారితో గూర్చుండఁగా నెడమచెవిలో మిక్కిలి బాధకలుగుచున్నదని చెప్పెను ఈ గింగురుమను శబ్దము క్రమేణా వృద్ధి

కాంగాఁ బడకపైఁ బరుండెను. పడకగదియొక్క గతిని చేరఁగా "ఓడాక్టర్ జోనాస్, నాజబ్బువిస్తారము. మంచి నీటిని తీసుకొనిరండి; లేనియెడల నేను చనిపోయెద" ననెను.

డాక్టరు జోనాస్ త్వరగా నీళ్లు ముఖముమీదను నీపుమీదను జల్లెను. అంతట లూథరిట్లు ప్రార్థించ మొదలిడెను. "ప్రేమగలదేవా, ఇది నాచివరిగడియయైన యెడల నీచిత్తమే సిద్ధించునుగాక!" అని, ప్రభువు ప్రార్థనను, ఆరవ సంకీర్తనమును గట్టిగా జెప్పెను. తరువాతభార్య, పడకగది దగ్గరకువచ్చి యాతని బలహీనతను చూచి మిగుల భయపడెను. డాక్టరుగారు వచ్చువఱకుఁ దనబాధ నివారణచేయ ప్రయత్నించిరి. మరల లూథరిట్లు ప్రార్థించెను. "ఓప్రభువా, నాదేవా, నేను నీవాక్యము నిమిత్తము ప్రాణమైనను సమర్పించెదనని నీకుదెలియును బహుశ నేను తగినవాడను కాను. నీచిత్తమే సిద్ధించునుగాక! ఈ రీతిగా నేను చనిపోవుట నీచిత్తమైనయెడల నట్లేజరుగనిమ్ము. జీవమువలనగాని మరణమువలనఁగాని నీనామమే ఘనపఱచబడునుగాక! దేవా నన్నీపనిలో నుంచితివి; నీవాక్యమును గూర్చియు సత్యమును గూర్చినపనియై యున్నది. నీశత్రువులు "నీదేవుడెక్కడ?" అని యడుగునట్లు చేయకుము. ఆశీర్వదింపబడినట్టియు, రక్షణార్థమైనట్టి నీవాక్యముయొక్క విరోధులను జయించి, నీనామమే పరిశుద్ధపరచఁబడునుగాక!"

డాక్టరుగారు రాఁగా, ఔషధమిచ్చి దైవచిత్తమైన యెడల నీసారి తొందరలేదని" చెప్పి లూథరునోదార్చెను. విట్టెనుబర్గుపాస్టరగు డాక్టర్ బ్యూజెన్ హేజన్ కూడ వచ్చెను. లూథరతనితో "పాదిరిగారు, నేను నాపాపముల నొప్పుకొంటిని. మీరు వాని క్షమాపణకొఱకై వేడుకొంటిరి. నాకుఁ జాలా సంతోషము" అని యనెను బాధయధికమైనప్పుడు మరలఁ బట్టుదలతో ప్రార్థించెను. భార్యనోదార్చి దేవుని చిత్తమున కప్పగించెను. తరువాత మరల ప్రార్థించెను. కొంతకాలమైన తరువాత నతఁడు "మహాధులగు అనాబాప్టిస్టులు, తదితరయల్లరిమూక నేను చనిపోయిన తరువాత నెంత బాధించెదరో! అయినను, క్రీస్తు, సైతాను దాని సమూహమంతటికన్న శక్తిమంతుడనే తలంపువలన శాంతించుచున్నారు. ఆయన ప్రభువైయున్నాఁడు" ఈమాటలు పలికి కండ్లనుండి నీరుకారినంత గట్టిగా నేడ్చెను. తరువాత 'నా కుమారుఁడగు హాన్సు యెక్కడ?" అనియడిగెను. బిడ్డను తీసికొని రాఁగా నతఁడు "ప్రియమైనబిడ్డా, నిన్ను నీతల్లికిని, నీతల్లిని దేవునికి నప్పగించుచున్నాను. ఓనాదేవా, నాకీలోకము నేమియు నియ్యలేదు. అందువలన నాభార్యకుగాని, నాకుమారునికిఁగాని యేమియు నిచ్చిపోవుటలేదు. నీవువీరిని నాకిచ్చిన రీతిని నేనువారిని నీకిచ్చుచున్నాను."

"దిక్కులేని బిడ్డలకుఁ దండ్రివియు, విధవలకు న్యాయ

మూర్తియైయునగుదేవా, నీవు నన్నెట్లుపోషించి, కాపాడి, నాకె ట్లు బోధించియుంటివో వీరినిగూడ నీవట్లు పోషించుము, బోధిం చుము, కాపాడుము.

ఈమాటల వలన నతని భార్యచాల భయపడి తన యాందోళన నంతటిని గప్పిపెట్టి యతని నోదార్చెను. వారాయ నను, వేడిబట్టలలోఁ గాచుటవలన లూథరు బాగుపడుచున్నా నని తలంచెను. అటుతరువాత మంచినిద్రపోయెను. బాధ నివారించెను. రెండవరోజు లూథరు జోనాస్‌తో "నిన్న నేను పాఠశాలకు వెళ్ళి వేడినీటి తొట్టెలోఁ గూర్చుంటిని. ప్రభువు నరకములోనికి తీసుకొని వెళ్లి మరల బయటికి లాగును. ఆయన చంపును; మరల బ్రతికించును. ఎందుకనఁగా నాయన జీవమరణాధిపులకుఁ బ్రభువైయున్నాడు. ఆయనకే స్తుతిమహి మలు నిత్యము చెల్లునుగాక! ఆమెన్"

లూథరనేక పర్యాయములు మరణద్వారములవద్దనుండెను. 1537 లో స్మాల్‌కాల్డులో జరిగిన మహాసభనుండి మరణా పాయమునుండి తీసుకొనిరావలసి వచ్చెను. తనజీవితములోని చివరి సంవత్సరములో ననేకవిధములైన బలహీనతలు, బాధలు నొప్పులతోబాధపడి, విశ్రాంతియనునది లేనట్లుతాను తన యందు నిమగ్నుడైయుండెను. తన మరణమునకుఁ గొన్ని నెలలకుముందే ఆదికాండముమీద వ్రాసినయఖండమైన వ్యా ఖ్యానమును సంపూర్తిచేసెను.

తన చివర ప్రసంగములో నిట్లనెను. "ఇది ప్రియమైన యాదికాండము. దీనికన్న మంచివాఖ్యానమును వ్రాయునట్లు దేవుఁడాశీర్వదించునుగాక! ఇంతకన్న నేనెక్కువ వ్రాయలేను. బలహీనముగా నున్నాను. నాకు మంచిమరణమిచ్చునట్లు దేవుని ప్రార్థించుడి."

జబ్బులనెడి శోధనలనుండి దేవునిమీద నాధారపడి సమస్త మెట్లోర్చుకొనెనో యట్లే జబ్బు శోధనలలోనున్నవారి నందఱిని లూథరోదార్చెను. అతఁడు నమ్మకముగలయాత్మల వైద్యుఁడై యుండెను. మరణావస్థలోను, జబ్బుస్థితిలో నుండఁగా లూథరు మఱియునాదరించువాఁడు. అపాయమతని వెనుకాడనీయలేదు. ప్లేగుజాడ్యము మానవులలోఁ బ్రవేశించి యపారజననష్టము కలుగఁజేయునపుడు జబ్బుగాను, మరణావస్థలలో నున్నవారి కపారసేవచేసెను.

## 3 లూథరుయొక్క యాశీర్వదింపబడిన మరణము.

మాన్సుఫెల్డుయొక్క ప్రభువుల మధ్యనున్న తగాదాలను తీర్చుమని లూథరేర్పాటాయెను. ఎయిస్లీబెన్నకు రెండుసార్లుతగాదా తేలనందున ప్రయాణము చేయవలసివచ్చెను. జనవరి 23, 1546 లోఁ దన ముగ్గురి కుమారులను వెంటబెట్టుకొని మూడవసారి ప్రయాణముచేయవలసి వచ్చెను. శీతకాలమధ్యమున ప్రయాణము చేయవలసి వచ్చెనుగాన ఎయిస్లీ బెన్

సమీపమున నతఁడు స్మృతితప్పిపడిపోయెను. అక్కడనే చనిపోవు నేమో యనితలంచిరి. ఉపచర్యలవలన తేలుకొనెను. జనవరి 29 నుండి ఫిబ్రవరి 16 వఱకు తగాదాను బరిష్కరించుటకై ప్రార్థించెను. చివరకుఁదన ప్రయత్నములు ఫలించెను. బలహీనముగా నున్నను, ఎయిన్లీ బెక్‌లో నాలుగుసార్లు ప్రసంగించెరు. ఫిబ్రవరి 15 వ తేదీన తన చివరి ప్రసంగములో "ప్రేమగల ప్రభువు తన కృపననుగ్రహించి, తన వాక్యమును గృతజ్ఞతతో మనమందుకొనఁగలుగునట్లును, మన ప్రభువైన యేసుక్రీస్తుయొక్క జ్ఞానమందును, విశ్వాసమందు నెనుగుచు మనవిశ్వాసమును ధైర్యముగా వెల్లడిచేయఁగలుగునట్లు దేవుడనుగ్రహించునుగాక!" అని ముగించెను. ఆదినముననే తనభార్యకు దేవుని చిత్తమైన యీవారములో దిరిగిరాఁగలమని యాశించుచున్నామని వ్రాసెను. ప్రభువులమధ్య తగాదా పరిష్కారమైనపుడు ఫిబ్రవరి 16 న సంతకముచేసి "ఈపని ముగిసిన తరువాత నేనింటికి వెళ్ళి సమాధిపెట్టెలో పరుండి పురుగులకు నాశరీరము నప్పగించెదను" అనెను. కానియతఁడు విట్టెన్‌బర్గుపట్టణమును మరలజూడనే లేదు.

మరుసటి దినము ఫిబ్రవరి 17 వ తేదీన, వ్యవహారములన్నిటినుండి విరమించవలసివచ్చెను. గదిలోనేయుండి అప్పుడప్పుడు బలహీనత వలన తనశయ్యపై నానుకొనవలసి వచ్చెను. అనేకసార్లు లేచి ప్రార్థించెను. తన స్నేహితులగు

డాక్టర్ జోనాస్, న్యాయాధికారియగు కోలియస్
గార్లతో నిట్లనెను. నేను ఎయిన్స్లీబెన్‌లోనే బాప్తీస్మమొంది
తిని. ఇక్కడనే నేనుండవలసి వచ్చునేమో" అని యని
యెను. తరువాత మరల నతడు 'ఈపాపప్రపంచమునుండి
యెంతత్వరగా దీసికొనివెళ్ళిన నంతమంచిదని' యనుచుం బ్రా
ర్థించెను. ఎందుకనంగా జీవితమును గూర్చి నిరాశనొందెను.
సాయంత్రము మరణమునుగూర్చియు, బునరుత్థానమును
గూర్చియు దృప్తికరముగా మాట్లాడెను. తరువాత గదిలోనికి
వెళ్లి, కిటికివద్ద మోకరించి ప్రార్థించెను. గుండెదగ్గఱనొప్పి
యనిచెప్పెను. వేడితువాలుతోం గాచగాం గొంతనివారించెను.
ఆల్‌బర్టు ప్రభువు ఔషధము తీసికొని వచ్చెను. దాదాపు
తొమ్మిది గంటల కతండు శయ్యపైం బరుండియరగంట నిద్రిం
చిన బాగుడుననియెను. పదిగంటలవరకు నెమ్మదిగానిద్రిం
చెను. తరువాత లేచి 'మీరందఱు మెలకువగానే యున్నారా?
పరుండుడి' యనెను. వారు జాగ్రత్తగాం గనిపెట్టుకొనియుందు
మని యనినపుడతండు తన పడకగదిలోకి వెళ్ళి 'దేవునిచిత్తము
జరుగునుగాక! నిద్రపోయెదను. నాయాత్మను నీచేతులకప్ప
గించుచున్నాను. నన్నునీవు విమోచించినావు.' అనిపరుండి,
యందఱికి కరస్పర్శచేసి, సెలవుతీసుకొని "డాక్టర్ జోనాస్"
న్యాయవాది కోలియస్, ప్రభువుకొరకు, నాయన సువార్త
విషయమై ప్రార్థించుడి. ఎందుకనంగా త్రెంటుమహాసభయు,

పోవున్న ప్రభువును వ్యతిరేకముగాఁ బలపేయుచున్నారు." అని నుడివెను

ఒంటిగంట వఱకు సుఖముగా నిద్రించెను. నిద్రనుండి లేవగానే, యదివరకేగది వేడిచేయఁబడినప్పటికిని గదిని వేడి చేయుఁడని కోరెను. బలహీనత యెక్కువగుచున్నదా? యని డాక్టరుజోనాస్, నడిగెను. అందులకు లూథరు "ఓ ప్రభువైన దేవా ఎంత బాధ! డాక్టర్ జోనాస్ గారూ, నేను బాప్తిస్మము పొందిన చోటనే చనిపోవలసియుండునను కుంటాను" అనినుడివెను. "సహాయము లేకయే యొంటరిగాఁ తనగదికి వెళ్ళి" నీ చేతులకు నా యాత్మనప్పగించుచున్నాను. సత్యమునకు ప్రభుఁడవైన తండ్రీ! నీవు నన్ను విమోచించియున్నావు" అనుచూ, గదిలో నటూనిటూ కొన్నిసార్లు నడచిన తరువాత, పడకమీదబడుండి గుండెలో బరువని తెలిపెను. ఇద్దరు డాక్టర్లకొఱకు కబురంపిరి. ఆల్బర్టు ప్రభువు నతని భార్యయు వచ్చిరి. బాధను తగ్గించుట కనేక ప్రయత్నములు చేసినప్పటికి "నేనెంతో బాధ పడుచున్నాను. నేను చనిపోతాను, ఎయిస్లీబెన్ లోనే నా మరణము ఖాయము." అనియనెను. చాలమందులిచ్చి చెమట కార్చిరని డాక్టరుజోనాస్ గారనఁగా లూథరు 'అవును, ఇది మరణపు చెమట' నేను చనిపోవుదును, బాధ యెక్కువగుచున్నది." అనియెను.

అతఁడిట్లు ప్రార్థించెను. 'ఓ పరలోకపు తండ్రీ; నా దేవా, మా ప్రభువైన యేసుక్రీస్తు యొక్క తండ్రీ, కష్టములలో నున్న

వారికి శరణమిచ్చువాఁడా, నీకుమారుని నాకు బయలుపఱచి నందుకు వందనములు చెల్లించుచున్నాను. నేనాయనను విశ్వ సించుచున్నాను. ఒప్పుకొని బోధించుచున్నాను. నేనాయనను ప్రేమించుచు స్తుతించుచున్నాను. కాని పోపును, నతని యను చరులును, విశ్వాసులను హింసించుచు దేవదూషణచేయు చున్నారు. నా ప్రభువైన యేసుక్రీస్తూ, నాయాత్మను నీ కప్పగించుచున్నాను. పరమందున్న తండ్రీ, యీశరీరమును విడిచినను, ఈ జీవితమునుండి చీల్చివేయఁబడినను నేను నీ యందే నిత్యముండెదను. కాఁబట్టి నన్ను నీచేతులలో నుండి యెవరూ బయటికి లాగలేరు." అని ప్రార్థించెను.

"దేవుఁడు లోకమునెంతో ప్రేమించెను. యో॥ (యోహా 3:16) వచనమున్ను, "దేవుడు మాపక్షమున పూర్ణరక్షణ కలుగఁజేయు దేవుఁడైయున్నాడు, మరణము తప్పించుట ప్రభువైన యెహోవా వశము" (కీర్త 68:20) అను వచనములను నెమ్మదిగా నుచ్చరించెను. వైద్యుఁడు నూతనౌ షధమిచ్చెను. ఒకగరిటెడు మందు త్రాగినతరువాత, తండ్రీ, నాయాత్మను నీచేతుల కప్పగించుచున్నాను. సత్యదేవుఁడ వైనప్రభువా! నన్ను నీవు విమోచించితివి." అనిపలికి నిశ్శబ్ద ముగా నుండెను. పిలిచిన పలుకలేదు. నాడిలోపడి నందున- బలుకలేదు. డాక్టరుజోనాస్, కోలియస్ ఇట్లనిరి. "ప్రియతండ్రీ, నీవుబోధించినరీతినే క్రీస్తునందును, ఆయనసిద్ధాంతములందును

విశ్వసించి మరణించుచున్నావా?" అని యడిగిరి. అందుకు లూథరు 'అవును' నెను. కుడిచేతివైపున కొరగి యొకపావు గంటనిద్రించెను. అందువలన మేల్కొని యున్నవారందరాయన నెమ్మది నొందుచున్నాఁడనుకొనిరి. కానిత్వరలో దనముఖము వికాసము దప్పి పాదములు చల్లబడెను. గట్టిగాను, నెమ్మదిగాను నూపిరిపీల్చి యవయవములఁ గదల్చకయే వదలివేసెను. ఈరీతిగా లూథరు ప్రభువునందు 'ఎయిస్లీబెన్‌లో' ఫిబ్రవరి 18, 1546 లో నుదయము మూడు గంటలకు ప్రాణము వదలెను

ఫిబ్రవరి 19, సాయింత్రము 2 గంటలకు లోహముతో జేయబడిన పెట్టెలో శవముపెట్టఁబడి, సెంటుఆంద్రేయ దేవాలయమునకు, అనేక ప్రభువులతో, సర్దారులతో బుర వాసులతో దీసికొనిపోఁబడెను. డాక్టర్ జోనాస్ 1 థెస్స. 4: 13-18 మీాద ప్రసంగించెను. రాత్రియంతయు బరుండి పారాకాచిరి. ఫిబ్రవరి 20 న, న్యాయవాది కోలియను-యెష యూ 57:1 మీాద బ్రసంగించెను. పట్టణ వెలుపలికి పెట్టెను తీసుకొని వెళ్లిరి. మరల ప్రభువులు, సర్దారులు, గొప్పజన సమూహమును పెట్టెవెంట నేడ్చుచు వెళ్లిరి డాక్టర్ జోనాస్ లూథరుయొక్క కుమారులతో నొకబండిలో వెళ్ళెను. మాన్సుఫెల్డుయొక్క యిద్దరు ప్రభువులు, నలభైయైనుగురు గుఱ్ఱపురౌతులు సమాధిపెట్టెవెంట విట్టెబర్గునకు వెళ్లిరి.

ఈజన సమూహము కదలిపోవునపుడు ప్రతిగ్రామములోని గుడులలోను గంటలు కొట్టిరి. ప్రతిచోట ప్రజలు గుంపులు గుంపులుగా చేరి వెక్కి వెక్కి యేడ్చిరి. హాలీపట్టణపు దేవాలయములో సమాధి పెట్టెను బెట్టి మరుచటిదినము వఱకు అక్కడనే యుంచిరి.

జనసమూహము విట్టెన్‌బర్గు పట్టణమును ఫిబ్రవరి 22 నాటికి చేరిరి. పట్టణద్వారముకడ విశ్వవిద్యాలయమునకు చెందినవారందఱు, పురపాలక సంఘసభ్యులు, పురవాసులు నందఱు, కలిసికొనిరి. సమాధి పెట్టెను నేదేవాలయపు దలుపునకు 95 సిద్ధాంతములను గొట్టిరో యా దేవాలయము లోనికి దీసికొనిపోయిరి. ఈయూరేగింపులో విద్యార్థులు, నుపాధ్యాయులు ముందుండి, నడిపించిరి. తరువాత సంఘము యొక్క నలుగురు పెద్దలు, వారివెనుక ఎలెక్టరుగారి యుభ్యర్థులు, మాన్సుఫీల్డుయొక్క పరిభువులు, వారిపరివార మున్ను తరువాత నడచిరి. తరువాత లూథరు శవము పెట్టెలో బెట్టబడి నల్లబట్టచుట్టబడి, బండిమీదదీసికొనిరా బడెను. విచారగ్రస్తురాలైన విధవరాలును, తనకుమారులును లూథరుయొక్క సోదరుడైన జాకబు నొకబండిలో తరువాత వచ్చిరి. తరువాత విశ్వవిద్యాలయముయొక్క పండితులు, నుపన్యాసకులు, వారి వెనుక పురపాలక వర్గము, ఇట్లు మహా వైభవముతో లూథరు శవమును సమాధికిదీసికొనివెళ్లిరి.

దేవాలయపులిపీఠముముందు లూథరు సమాధినుంచిరి. ఎయిస్లీబెన్‌లో డాక్టరు జోనాస్ ప్రపంచసముల మీద ప్రసంగించెనో యావచనములమీద డాక్టరు బ్యూగెన్ హేజెన్ ప్రసంగించెను. ల్యాటిన్ భాషలో మెలాంక్తన్ ప్రసంగించెను. దేవాలయపులిపీఠముదగ్గర సమాధి చేయఁబడి పునరుద్ధాన దినమున నిత్యమహిమనొందు వఱకు నక్కడ నేయుంచ బఁడెను.



# ముగింపు

లూథరు మృతజీవుడు. దేవుఁడు తన ద్వారా జరిగించిన పనియు నిలిచియేయున్నది. తాను జీవించియుండఁగా సిలోకముయొక్కయు, నరకముయొక్కయు, శక్తి లేమియుఁ జేసినట్లు, తన జీవితానంతరముకూడ నరక ద్వారబంధముల శక్తులు నిరర్థకములయ్యెను. దైవసేవకుఁడైన లూథరు సంపూర్తి చేసిన పనిని, లయపర్చుటకు యుద్ధములు చెలరేగెను. మొదట స్మాల్ కాల్డు, తరువాత ముప్పది సంవత్సరముల యుద్ధములు చెలరేగెను, వ్యాకులత, పని, ప్రార్థన, సాక్ష్యమిచ్చుట అనువాని ద్వారా బిడ్డుబాటు వలన సంపాదించిన దంతయు విరోధుల వలన నాశనమైనట్లు కనఁబడెను. కాని దైవకృపచేత విరోధులనుండి విశ్వాసులను గాపాడెను.

సమాధాన సువార్తను గప్పిపుచ్చుటకై యనేక తప్పుడు సిద్ధాంతములు బయలుదేరెను. కాని, "ఇవాంజలికల్" లూథరన్ సంఘముయొక్క విశ్వాసము నిలిచియే యున్నది. అనేకమంది విశ్వాసులిట్టి విశ్వాసములో దృఢముగా నిలిచి యున్నారు. మనయొక్క యాశయమేమై యుండవలెననఁగా "వాగ్దానము చేసినవాఁడు నమ్మదగినవాఁడు గనుక మన నిరీక్షణ విషయమై మన మొప్పుకొనునది, నిశ్చలముగాఁబట్టు కొందము." (హెబ్రీ 10:23).